


సాహిత్య మాస పత్రిక

# 354

అక్టోబరు, 1983

సంపుటి : 30, సంచిక 7

వార్షిక చందా : పది రూపాయిలు

విడిప్రతి · ఒక రూపాయి

ప్రకాశకులు :

దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర

హైదరాబాదు

**ది.11-8-1983నాడు హైదరాబాదులో హిందీ ప్రేమీమండలి ఆధ్వర్యాన జరిగిన హిందీప్రమాణ వితరణోత్సవసందర్భంలో తీయబడిన ఛాయాచిత్రం**



వేమూరిరాధాకృష్ణమూర్తి, గౌ॥ చేగొండి వెంకటహరిరామ జోగయ్య, గౌ॥ ఎం. రామచంద్ర రావు, హైదరాబాదు హిందీ ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ చవాకుల నరసింహమూర్తి, కార్యదర్శులు ఆదినారాయణ, డా॥ సత్యప్రసాద్‌గారలు, సభకార్యకర్తలు తదితరులు యిందుగలరు—

గాంధీ జయంతి సందర్భంగా దేశంలోని రాజకీయ నాయకులు సాంఘిక రంగంలో పనిచేస్తున్న సేవకులు, కార్యకర్తలు, యీ విషయాన్ని గమనించడం అవసరమని మనవి చేస్తున్నాము

మహాత్మాగాంధీ ఎంతో పవిత్ర భావంతో ప్రారంభించిన నిర్మాణ కార్యక్రమ రంగాలు కూడా పాడైపోయాయి. యింకా పాడైపోతున్నాయి. ఖాదీ, హరిజన సేవ మొదలుగాగల రంగాలు ఎలా తయారైనాయో అందరికీ తెలిసిన విషయమే దేశ సమైక్యత కోసం జాతీయ భాషా ప్రచార కార్యక్రమం బాపూజీ ప్రజల ముందుంచారు. దేశ స్వాతంత్ర్య సమరంలో ఒక భాగంగా హిందీ ప్రచారోద్యమాన్ని వారు ప్రారంభించారు. ఆ ఉద్యమంలో కూడా చెడ్డ శక్తులు ప్రవేశించాయి. ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా హిందీ ప్రచారం పేరుతో అక్రమాలు జరుగుతున్నాయి. వీటిని వెంటనే అరికట్టవలసిన అవసరం ఎంతైనా వున్నది. హిందీ ప్రచారమనీ, హిందీ జాతీయ భాష అనీ చెబుతూ హిందీ ప్రచారంతో కాని, హిందీ ప్రచారోద్యమంతో కాని, కనీసం జాతీయ సమైక్యతా కృషితోగాని సంబంధంలేని వ్యక్తులు ప్రభుత్వ, ప్రభుత్వేతర హిందీసంస్థల్లో ప్రవేశించడం, ఆ సంస్థల లక్ష్యాలను సక్రమంగా అమలు బరచక, వాటిని తమకోసం ఉపయోగించుకుంటూ వుండటం జరుగుతూవున్నది.

గాంధీ జయంతి సందర్భంగా అట్టి చర్యలు విరమించుకోమని, తమ చర్యల ద్వారా జాతీయ భాషా ప్రచారోద్యమానికి విఘాతం కలిగించవద్దని మనవి చేస్తున్నాము పవిత్రమైన గాంధీ జయంతిని పురస్కరించుకొని ప్రతి భారతీయుడు ఒక్కపర్యాయం ఆత్మపరిశీలన కావించుకొని, దేశ భక్తితో దేశ పురోభివృద్ధికి అంకితం కావాలని కోరుతున్నాము.



# మహాతపస్విని

—పిడపర్తి వెంకటరామ శాస్త్రి

ఏమమ్మా
గోదావరీమతల్లీ
మహాతపస్వినీ
ఎందుకమ్మా నీకింత శ్రమ !
అమ్మా అన్నం, అమ్మా అన్నం
అనే మా ఆకలి తీర్చడానికి
ఎందుకమ్మా నీకింత తపన !
నీలోని ప్రతి అణువు
ఒక బడబాగ్ని కీలగా మండిపోతూంది
ఏమమ్మా......

ఇక మేమున్నాం
సోమరులం
ఒక మొక్కయినా
నీకు నీడ నిచ్చేందుకు నాటలేని
బుద్ధిమంతులం
ఉన్నది సంగ్రహించడంలో మాత్ర
ఏమీ జాప్యం చెయ్యం
మహామేధావులం
ఓర్మికి అంతుంటుంది
నీ ఓర్మికి కూడా అంతం ఉంటూ ఉంది
ఉండుండి ఒక్కమారు
మాకు బుద్ధి చెప్పడానికి ప్రయత్నిస్తావు
తరంగ హస్తాలతో

శాంతిదుందుభులు మ్రోగించే నువ్వు
మహిషాసురమర్దనిలా
కాళికా కరాళిలా
రుధిరోద్గారి పై
ఆ-అని నోరు తెరుస్తావు
కాని- అదెంతసేపు
తృటిలో నీ హృదంనుంచి
అమృతధారలు ప్రవహిస్తాయి
మా బ్రతుకులు నీ నోములపంటలు
తల్లీ
మహాతపస్విని.

మార్కెటు వీధి
చింటుమిల్లి,
కృష్ణాజిల్లా-521 324



# స్వాగతం

-పి. యస్. ఆర్. మూర్తి

మైదానం ఈ దేశం
నా ఆటకు ఇది నిర్మితం
ప్రజలే నా ప్రేక్షకులు
ప్రజలే నా రక్షకులు
ప్రజాధనం నా పిత్రార్జితం
ప్రజాక్షేమం నా కర్తవ్యం

గుండాలను పోషిస్తా
కులద్వేషం, మతరోషం
పాతబడిన పగలను
పెంచడమే నా ధ్యేయం

ఉద్యమాల పేరు చెప్పి
ఊళ్ళవెంట బయలుదేరి
మాటలతో వెర్రెత్తించి
తుపాకులతో కాల్పించి
ప్రజాక్షేమ పరదా వెనుక
నిశ్చింతగ నిద్రిస్తా

అటో ఇటో గంతేసి
ఏదో పదవి కొట్టేస్తా
ఏ పదవీ కాకపోతే
అసమ్మతివర్గం అంటా

దూషణకు భూషణకు
తిరస్కార పురస్కారాలకు
అతీతుణ్ణి నేనంటా
అవి అంటవు నా కంటా

ఊసరవెల్లి కంటె త్వరగా
రంగుల్ని మార్చగలను
పగటి వేషగాడైనా
నాముందు బలాదూరు
గారడీవానికైన
నాకొచ్చిన విద్యలు రావు
జ్యోతిష్కులు నా వద్దకు
పాఠాలకు రావాలి
ఏ పార్టీ గెలుస్తుందో
నే నిట్టే చెప్పేస్తా

క్షామంతో బాధపడే
నా దేశపు ప్రజలపైన
వాగ్దానాల వానజల్లు
ప్రణాళికల పూలజల్లు
ఒకేసారి, ప్రతిచోటా
కురిపిస్తా, మురిపిస్తా

పూరిగుడిసె ఆవేదనలు
కనపడకుండా చేస్తా
బుల్‌డోజరు పంపించి
నా మాటను నిలబెడతా

నియంతృత్వ పోకడలను
ననేమిరా సహించను
ప్రతిరాష్ట్ర శాసనసభను
నా వాళ్ళతో నింపేస్తా
ఆత్మప్రబోధమంటూ
పార్టీని ఫిరాయిస్తా
అవసరమైతే నేనే
ఓ పార్టీ స్థాపిస్తా
కాశీయాత్రలోన నీతిని
గంగలో కలిపేశా
తిరుపతిలో నా ఆత్మను
హుండీలో పడవేశా.
ఏ పార్టీలో ఉంటే
ఆ పార్టీ శేషంటా
ఆ పార్టీ మారితే మాత్రం
ఆ పార్టీ చెత్తంటా
అభివృద్ధిని అంకెల్లో
ప్రగతిని పత్రాల్లో
చూపించే నా నేర్పుకు
నీరాజనమియ్యమంటా
సోషలిజం స్థాపనకే
ఈ మేడ ఈ కారు
ప్రజాసముద్ధరణకే
ఈ తోట ఈ బీరు

ప్రజాస్వామ్య రణరంగంలో
కవచం లేని కురువృద్ధుణ్ణి
ఎన్నికల్లో నిలబడేందుకు
కేవలం ధనార్హత కలవాణ్ణి
కాకాపట్టి. ఖాకాడీది
కోటలోన పాగావేస్తా
నా పదవికి ఎసరొస్తే
కోటనుంచి బయటపడతా
వీలైతే కోటను పడగొట్టే
పథకం చేపడతా.
విద్యార్థిని నా కోసం
పావులాగ నడిపిస్తా
నా కోసం ప్రజలను
చావుకు సిద్ధం చేస్తా
దేశంలోదరిద్రం
నా పాలిటి పెద్దవరం
దరిద్రమే లేకపోతే
ప్రజాసేవ చేయుటెట్లు?
ఉద్యమాన్ని నాకోసం
వక్రంగా చిత్రిస్తా
దానితోన పని తీరితే
మధ్యలోనే వదిలేస్తా
పెదవిలేక బ్రతుకగలను
పదవిలేక బ్రతుకగలను
ప్రజాసేవ చేసుకొనే
పదవిలేక బ్రతుకలేను

కె. కె. రోడ్
సూర్యాపేట,
నల్గొండ జిల్లా,
508 220

# ప్రజాకవి

—ఎ. రజాహుస్సేన్ ఎం.ఎ.

1

మేడిపండులాంటి
సమాజం
పొట్టవిప్పాడు
పురుగుల్ని చూపాడు
ఉప్పు కప్పురాల్ని
విశ్లేషించాడు
పెద్దబుద్ధులగుట్టు
రట్టుచేశాడు
చెడును కాదన్నాడు
మంచిని ఔనన్నాడు
అతడు ప్రజాకవి అన్నా !
అతడే మన వేమన్న !

2

కన్యాశుల్కాన్ని కాదన్నాడు
కన్యలచెర విడిపించాడు
బాల్యవివాహాలు వద్దన్నాడు
బంగారుబాటలు చూపాడు
వితంతు వివాహాలు జరిపించాడు
వెలుగుదివ్వెలు వెలిగించాడు
ప్రజలభాష నా దన్నాడు
ప్రజాకవి యైనాడు
ఆతడి భావికి జాడ గురజాడ !

3

పదండి ముందుకు అన్నాడు
శ్రామికులందరిని కలిపాడు
ధనస్వామ్యపు రెక్కలు నరికాడు
దగాపడిన తమ్ముళ్ళను
తాడిత పీడిత ప్రజలను
ఎలుగెత్తి పిలిచాడు
మరోప్రపంచం వైపుకు నడిపాడు
రెండు 'శ్రీ' లను ధరించి
ప్రజాకవితను వరించి
ప్రజాకవి యైనాడు !

4

కాళన్న కవిత
తెలుగుజాతికి మేలన్న
ప్రజల గోడవే తనదిగా
భావించి
భావిని చూపించిన
అసలైన సిసలైన
ప్రజాకవి అతడన్న

మంగళగిరి
గుంటూరు జిల్లా
522511

# నేల - మనిషి

—డా॥ ఆచార్యభావన్

నేల నిరీక్షిస్తుంది
తన బ్రతుకెప్పుడు
పచ్చనవుతుందా అని.
మనిషి నిరీక్షిస్తాడు
తన బ్రతుకెప్పుడు
బంగారమవుతుందా అని.
మనిషి నిరీక్షణలో స్వార్థం
నేల నిరీక్షణలో పరమార్థం !!

—o—

# ముందుకు కదులు

నిలబడ్డావు-
ఎంతసేపు అలా నిలబడతావ్?
చూస్తున్నావు-
ఎంతసేపు ఆలా చూస్తావ్ ?
నిలబడి చూస్తుంటే
కాలం వెక్కిరిస్తుంది
ముందుకు కదిలితేనే
జీవనం వికసిస్తుంది.

—ఓరుగంటివారి తోట
దాసన్న పేట
విజయనగరం. 2

# నవ్వుల దివ్వెలు

ఇలపావులూరి శేషగిరిరావు
(గిరీంద్ర)

రిత్తకలిమి కొఱకు-వత్తులు వెలిగించి
మత్తచిత్తయగుచు-మాయలాడి
సత్తు వెల్లబోవ-సాగిలబడునురా!
శిష్టగణకచంద్ర! శ్రీగిరీంద్ర!! 1

*

తెలిసికొనగ కనులు—దేవుడిచ్చిన మేలు;
చూచి, నేత్రయజ్ఞశోభ గనుము!
తాకబోయి, చేయిసోకిన-కాలురా!
శిష్టగణకచంద్ర! శ్రీ గిరీంద్ర!! 2

*

స్పర్శలేనిచోట—శ్రద్ధ నిల్వగబోదు!
గంగవోలె తనువు గడుగవలయు!
రాగభోగములనే-రోగాలు పెచ్చురా!
శిష్టగణక చంద్ర! శ్రీగిరీంద్ర!! 3

*

నిగ్రహమ్మువలన-నేరుపు పెరుగును!
ఆగ్రహమ్మువలన-అలతియగును!
ఆత్మసంయమమ్ము-హాయి కల్గించురా!
శిష్టగణక చంద్ర! శ్రీగిరీంద్ర!! 4

*

నవ్వలేక ఏడ్చునాతి వగలమారి-
ఏడ్వలేకనవ్వు వెఱ్ఱిమగడు!
నవ్వగలుగుజంట-దివ్వెల పంటరా!
శిష్టగణకచంద్ర! శ్రీ గిరీంద్ర!!

# భాషా విజ్ఞాన వికాసం

## (ది ఎవల్యూషన్ ఆఫ్ లింగ్విస్టిక్స్)

డా. హెచ్. ఎస్. బ్రహ్మానంద

భాషను శాస్త్రీయ పరిజ్ఞానంతో పరిశీలించే శాస్త్ర విభాగం భాషా విజ్ఞానం. ఈ నాడు ఇండియాలో ప్రసిద్ధంగా బోధింపబడుచున్న భాషా విజ్ఞానం ప్రధానంగా రెండు దశలలో వృద్ధిపొందింది.

### 1. ఫైలాలజీ

ఆంగ్లేయులు ఇండియాని పాలించిన కాలంలో విలియం జోన్స్, మాక్సుముల్లర్, కాల్డ్ వేల్ మొదలయిన ప్రసిద్ధ వాఙ్మయ పరిశోధకుల కృషి ఫలితంగా ఇండియాలోని భాషలమీద, ముఖ్యంగా సంస్కృత, ప్రాకృత దేశభాషల మీద చారిత్రక పరిశోధనలు మొదలయ్యాయి. లిఖిత సాహిత్యంలోని సాంస్కృతిక పరిణామంతో పాటు భాషాసాహిత్య పరిణామాన్ని కూడ 18, 19 శతాబ్దాలలోని దేశ విదేశీయ పండితులు వివరించారు. స్థూలంగా పైలాలజీ అంటే ఇదే. భాషాకుటుంబ విభజన మూల భాషా పునర్నిర్మాణం ఇత్యాది అంశాలు ఆరోజుల్లో ఆకర్షకమైన పరిశోధక విషయాలు. తెలుగులో కోరాడ రామకృష్ణయ్యగారి తరం దాకా వచ్చిన పరిశోధనలన్నీ ఫైలాలజీలో భాగంగా వచ్చినవే.

### 2. మోడర్న్ లింగ్విస్టిక్స్

భద్రిరాజు కృష్ణమూర్తి గారితో ఆధునిక భాషా విజ్ఞానం తెలుగులో చోటు చేసుకొంది. ఫైలాలజీకన్నా ఆధునిక భాషా విజ్ఞానం ఎక్కువ శాస్త్రీయమూ విశ్వజనీనమూ, గిడుగు రామూర్తి పంతులుగారితో పాట మరించినా (ఆయన రచించిన సవర భాషా నిఘంటు వ్యాకరణాలు, గుర్తించిన స్వర సిష్పీకరణ సూత్రం ఉదాహరణలు), గంటిజోగి సోమయాజి గారి 'ఆంధ్ర భాషావికాసం' లో, తెలుగు, భాషా చరిత్రకు సంబంధించి కొన్ని నూత్న ప్రతిపాదనలున్నా, కృష్ణమూర్తి గారి 'కొండ' భాషా వ్యాకరణం (1969) తెలుగు వర్బల్ బేసెస్ (1961) మాండలిక పరిశీలనలు (1062 నుంచి) వీటితోనే ఆధునిక భాషా శాస్త్రము ఒక అధ్యయన విభాగంగా గుర్తింపును పొందింది. కోరాడ మహాదేవ శాస్త్రిగారి, తెలుగు భాషా చారిత్రక వ్యాకరణం (1969) జె. యస్ రెడ్డి గారి తెలుగులో అర్థ పరిశోధన (1966) ఇవి భాషా పరిశోధనలో భిన్న రంగాల్ని ఆవిష్కరించాయి. చేకూరి రామారావు గారి గ్రంథంలో (తెలుగు వాక్యం-1975) ఇతర వ్యాసాల్లో (తెలుగులో బహువచనం మీద అవి చేసే పనిమీద, నామ్నీకరణల మీద, పరివర్తన సిద్ధాంతం మీద) రామారావు గారు భాషా శాస్త్ర పరిధుల్ని విస్తరించారు. (బూదరాజు రాధాకృష్ణ, కందప చెట్టి వంటివారు శాసన భాష మీద, దొణప్ప, అక్కిరెడ్డి మొదలైనవారు అన్యదేశ్యాలమీద, ఉషారాణి వంటివారు నిఘంటువులమీద, కేతు విశ్వనాథ రెడ్డి వంటివారు ఊర్ల పేర్ల మీద (ఒనమాస్టిక్స్ చేసిన పరిశోధనల్లో చారిత్రక భాషావిజ్ఞానం-నిర్మాణ భాషా విజ్ఞానం-రెండూ కలిసి వున్నాయి).

ఇటీవలి సంవత్సరాల్లో వెన్నెలకంటి ప్రకాశం (కావ్యభాషా ప్రాముఖ్యత మీద) గారితో ఇంగ్లండు

లోని సర్దియస్ పరిశోధన మార్గం కూడా తెలుగులోకి చేరింది. బ్రహ్మానంద (వ్యంజన సూత్రం-1981) గారి భాష భావ వినిమయానికే గాకుండా అభివ్యక్తికి గూడా మాధ్యమిక మన్నా ఆర్వాచీన సిమియాటిక్స్ మార్గాన్ని తెలుగులో ఆవిష్కరించడం జరిగింది కూడా. (చూ. రామారావు, నరసింహారెడ్డి 'మహతి' లో 1972).

## ప్రాచీన యుగాల్లో భాషా పరిశీలన

ఇండియాలోని వ్యాకరణ అలంకారాది శాస్త్ర సంప్రదాయాల్లో చెప్పబడ్డ భాషా పరిశీలనా దృక్పథాలు ఇటీవలి సంవత్సరాల్లోనే గుర్తింపబడ్డాయి. బ్లూంపీల్డు (లాంగ్వేరాజ్ - 1988) తరువాతి పరిశోధనలకు పాణిని అష్టాధ్యాయిలోని సూత్ర సంక్షిప్తత పాణిని లోని అసామాన్య మేధస్సంపదా ఎంతో దీప్తినిచ్చాయి.

## భారతదేశంలో భాషా శాస్త్రం? :

వేద సంప్రదాయంలో సంహితలు, బ్రాహ్మణాలు, శిక్షలూ, ప్రాతిశాఖ్యలు, ఉపనిషత్తులూ వీటిలో సంస్కృతభాష నాధారంగా భాషా విశ్లేషణలో అనేక అమూల్యమైన అంశాలు గుర్తింపబడ్డాయి. స్వరవ్యంజన భేదం ధ్వని స్థాన కరణ ప్రయత్న నిరూపణం. సంహిత స్వర భేదాలు (చూ. డబ్ల్యు యస్. అలెస్-ఫొనెటిక్స్ ఇన్ ఎంపియంట్ ఇండియా-1957) ధాతు ప్రత్యయ విభాగం లింగవివేచన క్రియా స్వరూపం కొరకు మీమాంస సూత్ర నిర్మాణం ఇలాంటి అంశాలు అష్టాధ్యాయిలో (కీ. పూ. 4వ శ) ఎంతో స్పష్టంగా అధికారికంగా రూపుదిద్దుకున్నాయి.

యాస్కునితో (పాణినికి పూర్వుడు) మొదలయిన నిఘంటు నిరుక్త నిర్మాణం భాషా రూపంలో మౌళికార్థాన్ని గుర్తించిన తొలిప్రయత్నం. కాత్యాయనుని వార్తికాలు (క్రీ పూ. 300) పతంజలి మహాభాష్యం) (కీ. పూ. 150) భర్తృహరివాక్య పదీయం (కీ శ. 450) భాషానిర్మాణ తత్త్వాలకు సంబంధించిన అత్యుత్తమ గ్రంథాలు, మీ మాంసకులు, నైయాయకులు అర్థాన్ని గురించి, తాంత్రికులు, అలంకారికులు అభివ్యక్తిని గురించి వ్రాసిన గ్రంథాలు పరమ ప్రమాణాలు (వివరాలకు చూ. స్టాల్. బ్రహ్మానంద1971).

## గ్రీకుల భాషా వివేచన: (కీ.పూ.5-3 శ)

సోక్రటీసు, ప్లాటో, అరిస్టాటిల్‌ల ప్రసంగ గ్రంథాల్ని బట్టి ప్రధానంగా తెలుస్తున్న విషయాలు శబ్దార్థ సంబంధం మీద వారికున్న దృక్పథాలు. సోక్రటీసులు తార్కికుడు. ప్లాటో భావవాది. అరిస్టాటిలు వస్తువాది వీరి అభిప్రాయాల్లోని-మౌలికత తర్వాతి శతాబ్దాల్లో భిన్న శాస్త్రాలుగా రూపొందింది. స్థాయికులు తాత్త్విక దృక్పథంతో (కీ పూ. 5) భాష ఒక భావ వాహికగా గుర్తింపబడ్డది.

అలెగ్జాండ్రియనులలో (కీ. పూ.) 3.1శ) థాక్స్ వ్రాసిన 'టెక్నే' అన్న వ్యాకరణ హోవర్ రచనల నాధారంగా కావ్యభాషలోని రూపసాధుత్వ నిర్ణయాన్ని చేసింది.

## రోమనుల భాషా పరిశీలన :

క్రేట్స్ (క్రీ.పూ. 2శ) వ్యారో క్విటిలియస్ మొదలైన వారు వ్రాసిన గ్రంథాల్లో దారు రూపాల మీ మాంస వక్తృత్వ లక్షణము నిరర్థకత భావ వ్యంజకత మొదలయినవి ప్రధానము.

## మధ్యయుగాలు : [క్రీ.శ. 1100-1600]

వ్యాకరణం అన్ని శాస్త్రాలకు మూలమని, కాని తర్క అలంకారాది ఇతర శాస్త్రాలలో ఇది కూడా ఒకటని అభిప్రాయమేర్పడ్డది. క్రీ. శ. 200-1350 ప్రాంతంలో స్పెక్యులేటివ్ గ్రామర్సు పుట్టాయి. ప్రిసియస్, పీటర్, క్లియాస్, పెట్రస్, ఇస్పానస్, మైకేల్ మొదలయిన వారి రచలతో వ్యాకరణమంటే భాషను గురించిన విజ్ఞాన మన్న నూత్న ధోరణి పుట్టింది.

## హేతువాదాభ్యుదయం :

16వ శతాబ్దము నుండి యూరప్ దేశాల్లో సాంస్కృతిక పునరుజ్జీవనం మొదలయింది. ప్రపంచ విస్తృతి, అన్ని భాషలు, ఐరోపా ప్రజలకి విశ్వజనీన దృక్పథాన్ని కల్గించింది. వాస్తవిక (ఎంపిరిసిజమ్) హేతువాద (రేషనలిజం) విధానాలు వృద్ధిపొందాయి. బైబిలులో చెప్పబడ్డ బాబెల్ గోపుర కథను అసత్యం చేయడం కోసం సర్వప్రపంచ మానవుల ఏకైక భాషా నిర్మాణం చేయడం కోసం క్రమక్రమంగా ప్రయత్నాలు సాగాయ్

భాషల్ని గురించి వివరించడం, భాషల్ని తులనాత్మకంగా పరిశీలించడం 16వ శతాబ్ది ప్రారంభంలోనే మొదలైనట్టుగా చెప్పవచ్చు (గ్రెస్నర్, మగ్రెసన్, పల్లాస్, వారెంజో, ఆటలుంగ్ మొదలయిన వారి రచనలు) పోర్టు రాయల్ వ్యాకరణం (1660)లో మొదటిసారిగా భాషలోని వాస్తవాల్ని త్రవ్వటం కన్పిస్తుంది. 15వ శతాబ్దంలోనే స్కాట్లండు ప్రభువైన 4వ జేమ్సు (సామెటికస్ అనే ఈజిప్టు ప్రభువు (క్రీ పూ. 500) కూడా ఇలాగే చూశాడు) ప్రపంచంలో మొదటి భాష యేది అన్న మీమాంసను జరిపారు. ఆ కాలంలో పండితులు మత భాషయైన హిబ్రూ ఆది భాష కావచ్చని అభిప్రాయపడ్డారు.

లిబ్నిజ్ (1645-1716)తో భాషా పరిశీలనలో అనువంశిక (జీనియాలాజికల్) దృష్టి ఏర్పడ్డది, హిబ్రూ ఆది భాషకాదని గుర్తించడమె ఆయనలోని తులనాత్మక విజ్ఞతకు నిదర్శనం.

హర్డర్ (1744-1803)లో భాషదైవదత్తంకాదన్న కృషి కన్పిస్తుంది. కాని ఆరోజుల్లో ఆయన మానవుడే భాషను సృష్టించుకొన్నాడని తేల్చలేదు అట్లని భాషా వ్యవహారంలో మానవుడి పాత్రను నిరసించనూ లేదు.

విలియం జోన్సు (1746-1794) కలకత్తాలో బ్రిటిషు కోర్టులో జూరిస్టుగా వచ్చాడు. సంస్కృతాన్ని అభ్యసించి 1786లో ఏసియాటిక్ సొసైటి వారి సభలో ప్రసంగించినాడు. సంస్కృత, గ్రీకు లాటిను భాషలకు మూలికి గల సగోత్ర సంబంధాన్ని వూహించటంతో ప్రపంచంలోనే భాషా విజ్ఞానం రూపుదిద్దుకోవడానికి ప్రారంభం జరిగింది. క్రీ. శ 1800 తర్వాతే భాషా శాస్త్రంలో చారిత్రక దృష్టి స్థిరపడింది.

### రాస్మస్ క్రిస్టియన్ రాస్క్ (1787-1832)

ఈయనతో స్కాండినేవియన్ భాషామూలాలు త్రవ్వడం మొదలైంది. గ్రిమ్సుకు ముందే ధ్వనుల పరిణామాన్ని గురించి కూడా ఈయన ఊహించాడు.

### జాకబ్ గ్రిమ్

(1785-1867) ఇతని జర్మన్ వ్యాకరణంలో భాషను విరమించాలన్న దృష్టి కన్పిస్తుంది. గ్రిమ్ ధ్వని సూత్రాలు ఇండో-యూరోపియన్ భాషల్లోని హల్లుల పరివర్తనాన్ని గురించి చెబుతాయి. ఇతని పరిశోధన తరువాత చారిత్రక తులనాత్మక వ్యాకరణాలకు వెన్నెముక అయింది.

### ఫ్రాంజ్ బాప్

(1791-1867) సంస్కృత, జెర్మన్, లాటిన్, లిథోనిన్, గోథిక్, ఇత్యాది భాషల తులనాత్మక భాషల్ని ఈయన వ్రాశాడు. పదస్వరూపాల్ని గురించి వివరించడంలో రూపం/అర్థం ప్రధానమన్న అవగాహన మొదటిసారిగా ఈయనలోనే కన్పిస్తుంది. సంస్కృత వ్యాకరణ పరిచయం ఇతని పరిశీలనకు ఇతని నేపథ్యంలోనే వుంది.

### ఆగస్ట్ స్లైచర్

(1821-1868) డార్విన్ జీవపరిణామ సిద్ధాంతాన్ని భాషా పరిణామం మీద ఆపాదించి, భాష సహజంగా పుట్టి పెరిగి నశించే పదార్థంగా వ్యాఖ్యానించడం స్లైచర్‌లో కన్పిస్తుంది. మూలభాషా పునర్నిర్మాణం, తులనాత్మక-పరిశీలన భాషల నిర్మాణ

(టాక్సానమిక్) అంశాల్ని ఆధారంగా వర్గీకరించడం ఇతని కృషిలో భాగాలు. భాషల్ని హెగ్ ప్రతిపాదించిన "థీసిస్ అంటీ థీసెస్, సింథెసిస్" దృక్పథంతో చూచి భాషల్లో మూడు రకాల్ని గుర్తించాడు. అవి పృథక్పద, సయోగాత్మకపద, నిష్పన్నపద భాషలు అన్ని భాషల మొదట్లో 'అవిభక్త' శబ్ద రూపాలు (ఐసోలేషన్)గా ఉండి ఉండాలని ఇతని ప్రతిపాదన. తర్వాత చెప్పిన హెర్మెన్‌పాల్ స్వాదెష్, మొదలయిన వారి మీద స్లైచర్ ప్రభావం ఎంతో వుంది.

## నిర్మాణ భాషా విజ్ఞానం

20 వ శతాబ్దంలో (ఏల్ హెల్మ్, వాస్, హంబోల్ట ప్రేరణలో) అమెరికాలోనూ, ఇతర యూరప్ దేశాల్లోనూ, ఆధునిక భాషా విజ్ఞానం స్పష్టమైన పరిధులతో అవతరించింది నిర్మాణ భాషా విజ్ఞానం (ప్రక్చరలు లింగిస్టిక్సు) అనే పేరు ఈ శతాబ్దంలోని భిన్న భాషా సంప్రదాయాలకు సమానంగా వర్తించే శాస్త్రీయ దృక్పథాన్ని వెన్నెముకగా కల్గింది. పరిశీలన వస్త్వాశ్రితంగా ఉండటం (ఆబ్జెక్టివిటీ), నిరూపణ క్రమంగా ఉండటం, (ఎంపిరిసిజం)- ఈ శాస్త్రీయతా లక్షణాలు, భౌతిక, గణిత, మానవ పరిణామ, ప్రకృతివాద తత్త్వాలు ప్రముఖంగా నిర్మాణ భాషా విజ్ఞానానికి నేపథ్యాన్ని కల్గించాయి. భాషకొక నిర్మాణముందని, దాన్ని కనుక్కోవడమే భాషాపరిశీలకుడి ధ్యేయమని విశ్వసిస్తుంది.

## పర్డినాండ్-డి-ససూర్

(1857-1913) ఈయన స్విస్ దేశీయుడు వీరి ఉపన్యాసాలనే 1916 లో కోర్స్ ఇన్ జనరల్ లింగ్విస్టిక్సు అనే పేరిట ప్రచురించారు. మొదటిసారిగా 'భాష' అంటే ఏమిటో నిర్వచించుకొన్నాడు భాష సంకేతమయమని. సంకేతంలో రూపార్థాలు కలసి వుంటాయని, భాషా వ్యవహారం సంకేతాలకున్న ప్రత్యామ్నాయ సంధాన ప్రక్రియలవల్ల సాగుతోందని ససూర్ ప్రతిపాదన. భాషలో గుప్తమైన నిర్మాణం (లాంగ్), వ్యక్తమైన సంకేతాలు (పరోల్) వున్నాయని ఈయన గుర్తించాడు. భాషను చారిత్రకంగా, వర్ణనాత్మకంగా, వివరించవచ్చన్న ప్రతిపాదనలు ఈయనవే.

## హంబోల్ట్ :

(1767-1835) ఈయన జర్మను తాత్త్వికుడు. ససూర్ ప్రతిపాదనలకు నేపథ్యంలో హంబోల్ద్ ప్రతిపాదనలున్నాయి. మొదటసారిగా భాషవస్తువు (థింగ్) కాదని, ప్రక్రియ (యాక్టివిటి) అని చెప్పిన వాడు ఈయనే. భాషలోని గుప్తవ్యక్తి నిర్మాణాల ప్రసక్తి కూడ మొదటిసారి ఈయనే చేశాడు. (తరువాతి సంవత్సరాల్లో చాంస్కీ దీన్ని ప్రపంచించాడు)

## బెంజమిన్-లీ-ఉర్ :

(1897-1941) భాష, భావం, వాస్తవికత, అనే విషయాలమీద ఉర్ఫ్ చెప్పిన అభిప్రాయాలు చాలా ప్రామాణికమైనవి మానవుడి ఆలోచన తాను వాడే భాషా పదజాలంతో సాపేక్ష సంబంధాన్ని కల్గిందని ఉర్ఫ్ సిద్ధాంతం. (సపీర్-ఉర్ఫ్ ప్రతిపాదన అని దీన్నే అంటారు. సపీర్) (1921), బ్లూంఫీల్డు (1933) నైడా (1943) గ్లీసన్ (1955), హాకెట్ (1959), హానిగ్స్వెల్డ్ (1962), మొదలైన పాఠ్యగ్రంథాలు సామాన్య భాషా విజ్ఞానముల సూత్రాల్ని అందించడానికి రాయబడ్డాయి

## లింగ్విస్టిక్స్-సెమియోటిక్స్ :

ససూర్ ప్రతిపాదల్ని మూలంగా గ్రహిస్తూ, భాషా విజ్ఞానంతో పాటు సెమియోటిక్స్ (సంకేతవాదం) కూడా పుట్టింది. భాషకు మానవుడితోవున్న మానసిక ఆంగిక సంబంధాన్ని గుర్తిస్తూ భాషను అభినయాత్మకమైన బావాభివ్యక్తి ప్రక్రియగా నిరూపించే ప్రయత్నం వేయర్స్, మోరిస్, ఎంప్లేవ్, బార్థెస్, మొదలయిన సంకేతవాదులు చేశారు, ట్రాబిట్స్కాయ్ రోమన్

యాకబ్‌సన్, మొదలయిన వారితో ప్రాగ్‌వర్గం (హలిడే దీన్ని వృద్ధిపొందించాడు) స్వతంత్రంగా పెంపొందిన భాషా పరిశీలన వర్గాలు.

## నోమ్ చామ్స్కీ-భాషా సిద్ధాంతం :

20వ శతాబ్దంలోని ఆధునిక భాషావిజ్ఞాన రంగం చామ్స్కీ ప్రతిభ చుట్టూ తిరుగుతోంది. ఈయన రాసిన అసంఖ్యాక గ్రంథాల్లో, వ్యాసాల్లో భాషావిజ్ఞాన పునాదులు త్రవ్వబడ్డాయి. భాషా పరిశీలనలో ప్రవృత్తి వాదాన్ని నిరసిస్తూ హేతువాదాన్ని డికార్టే సంప్రదాయాన్ని చామ్స్కీ పునర్వ్యాఖ్యానించాడు. భాషా వ్యవహర్తకు భాషా నిర్మాణ వ్యవహార సమర్థమైన ప్రతిభ (కాంపిటెన్స్) వుంటున్నది. ఈయన ప్రతిపాదనల్లోని సారాంశం భాషానిర్మాణంలో అర్థం గుప్తరూపమని శబ్దనిర్మాణం పరివర్తన సూత్రాలద్వారా ఏర్పడుతున్న వ్యక్త రూపమని ఈయన సిద్ధాంతీకరించాడు. భాషా వ్యవహర్తలోని సూత్రరూప వాగ్వ్యవహార ప్రతిభను గుర్తించడమే భాషా సిద్ధాంత ధ్యేయంగా ఈయన ప్రతిపాదించాడు.

20వ శతాబ్దంలో వచ్చిన 101-2 భాషా శాస్త్ర మార్గాల్లో చాలా వరకు చామ్స్కీని వివరించేవో సవరించేవో, పూరించేవో మాత్రమే అవుతున్నాయి. సామాజిక భాషా విజ్ఞానం గణాంక రూప భాషావిజ్ఞానం చాలా ఆసక్తికరంగా ఈ రోజుల్లో చదుబడుతున్న భాషా విజ్ఞాన సంప్రదాయాలు. (చూ. వాటర్‌మన్-1963, డినీన్-1967, రాబిన్స్-1967)

### పఠనీయ వాఙ్మయం :


1. కుంజన్ని రాజా. కె. — ఇండియన్ థియరీస్ ఆన్ మీనింగ్ (1963)
2. డినీన్ ఫ్రాన్సిస్, పి. — ఇంట్రడక్షను టు జనరల్ లింగ్విస్టిక్స్ (1967)
3. బ్రహ్మానంద, హెచ్. యస్. — వ్యంజన సూత్రం (1981)
4. రాబిన్స్, ఆర్. హెచ్. — ఏ షార్ట్ హిస్టరీ ఆఫ్ లింగ్విస్టిక్స్ (1967)
5. రామారావు, చే. నరసింహరెడ్డి పి. సి — భాషాకృషి (మహతి-1972)
6. వాటర్‌మన్ జాన్, టి. — పర్‌స్పెక్టివ్స్ఇన్ లింగ్విస్టిక్స్ (1963)
7. స్టాల్ జె. ఎన్. — ఏ రీడర్ ఆన్ సంస్కృత్ గ్రమేరియన్స్ (1972)



ఆంధ్రభారతి
శ్రీ ప్ర. వి. వి.
అనంతపురం-515003

# మహాభారతంలోని రాజకీయ భావాలు

—ఆచార్య శ్రీపతినాయుడు

మహాభారతానికి పంచమ వేదమని పేరు అంటే ఆర్యుల వేదాల తరువాత ఇతిహాస యుగం వచ్చింది. ప్రాచీన భారతంలో ప్రసిద్ధి చెందిన ఇతిహాసం మహాభారతం. మనుస్మృతితో పాటు మహాభారతం ధర్మశాస్త్రానికి సంబంధించింది. ప్రాచీన భారతీయుల రాజకీయ భావాలు భారతంలోని శాంతి పర్వంలో చెప్పబడినాయి. ఇతిహాస కాలం నాటి వివిధ పరిస్థితుల పరిశీలనకు అధ్యయనానికి శాంతి పర్వం ఎంతో ఉపయోగ పడుతుంది. పర్వం పేరు శాంతి. యుద్ధానికి వ్యతిరేకంగా శాంతి స్థాపన ప్రాముఖ్యతను ఈ పేరు వివరిస్తూ ఉంది. 'రాజధర్మం', దండ నీతి, అనే రెండు ప్రముఖ రాజకీయ భావాలకు రూపకల్పన జరిగింది.

## రాజధర్మం :

యుధిష్ఠిర మహారాజు చెప్పిన రాజనీతి ధర్మాలను భీష్ముడు ఆమోదించినాడు. ఆశ్రితులకు రక్షణ కల్పించడం రాజధర్మంలో మొదటి నీతి. మావటివాడు ఏనుగును బంధించినట్లుగా, అశ్వికుడు గుర్రాన్ని అదుపులో పెట్టిన రీతిగా రాజు ప్రజలను అదుపులో ఉంచుకోవాలి. చిన్న చిన్న జంతువుల అడుగులు, ఏనుగు పెద్ద అడుగులో కలిసిపోయినట్లు, అన్ని ధర్మాలు రాజధర్మంలో కలిసి పోతాయని యుధిష్ఠిరుడు చెప్పినాడు. ప్రజా సంక్షేమం రాజధర్మంపై ఆధారపడి ఉంటుంది. రాజు ధర్మ ప్రవర్తకుడైతే, దేశంలో శాంతి భద్రతలు ఉండి, ప్రజలు సిరిసంపదలతో, సుఖ సంతోషాలతో జీవించగలరు. అగ్రకులాలకు చెందినవారు ఆశ్రమ విధులను సక్రమంగా నెరవేరిస్తే, సమాజంలో శాంతి ఉంటుంది. నిజం చెప్పాలంటే రాజు ప్రవర్తన, ధర్మ దీక్షపై సామాన్యుల జీవన విధానం ఆధారపడి ఉంటుంది సాంఘిక భద్రత, రాజకీయ సుస్థిరత, ఆర్థికాభివృద్ధి, నైతిక ప్రవర్తన వంటి ఉత్తమ భావాలన్నీ, రాజధర్మం మీద ఆధారపడి ఉంటాయి. వ్యక్తిగత సంక్షేమం. సామాజిక భద్రత అనే రెండు పనులను రాజధర్మం నిర్వహించగలదు. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ చేసి. రాజు ఆదర్శవంతుడుగా ఉండవలె. రాజు ఆదర్శ జీవితం ప్రజలకు ఆదర్శవంతం కావాలి. తన వరవడికతో, ప్రజలను మెప్పించి, ప్రజలను ఆవిధంగా నడచుకోమని చెప్పేవారు రాజధర్మాన్ని పాటించిన రాజు. ప్రజల క్షేమాన్ని కోరి, ప్రజా సంక్షేమం కోసం కృషి చేసే బృహత్తర బాధ్యతను రాజు స్వీకరించవలె

రాజ ధర్మాన్ని అనుసరించి, దేశ వ్యవహారాలలో రాజు నిర్వహించిన పాత్ర బోధపడుతుంది. సకల శుభకార్యాలకు రాజు మూల పురుషుడు. వివాహానికి ముందుగా, ఆస్తులను కొనే ముందుగా రాజదర్శనం చేసుకోవడం పరిపాటి. దీనిని బట్టి సామాజిక జీవితంలో రాజు నిర్వహించే పాత్ర అర్థమవుతుంది. రాజధర్మానికి ఉన్న ప్రాముఖ్యత బోధపడుతుంది. నాగరికమైన జీవనానికి మూలం రాజరికం, రాజధర్మం. అవసర సమయాలలో అత్యవసర పరిస్థితులలో రాజు ప్రజలకు రక్షణ కల్పించాలి. వరదలు, ప్రకృతి భీభత్సాలు, అంటు రోగాలు, శత్రువుల దాడి, దొంగల దోపిడి, వివాదాలు మొదలైన సమస్యలను రాజు జాగ్రత్తగా గమనించి ప్రజలకు అభయం ఇవ్వాలి.

రాజు అసమర్థుడు అయినప్పుడు ఆ రాజ్యాన్ని వదలి వెళ్ళడమే క్షేమం అని యుధిష్ఠిరుడు బోధించినాడు.

భీష్ముడు రాజు దైవాంశ సంభూతుడని నమ్మినాడు. దైవదత్తమైన ఉత్తమ గుణాలు కల్గిన వ్యక్తి రాజు పదవి నిర్వహించడానికి అర్హుడు మనుస్మృతిలో రాజు శరీరంలోని అంగాలన్నీ వివిధ దేవతల రూపాలని చెప్పబడింది. ప్రజా రక్షకునిగా రాజు బ్రహ్మ, విష్ణు మూర్తులవలె వ్యవహరించాలి. దుష్ట సంహార క్రియలో శివుడు, యముడు, ఇంద్రుడు, అగ్ని ఆదిత్యుడు మొదలైన రూపాలను ధరించాలి. అగ్నిదేవునివలె విజృంభించి దుష్ట శత్రువులను దహించి వేయవలె ఆదిత్యునివలె సర్వభూభాగాన్ని పరీక్షించవలె. క్రూరులను యమునివలె నిర్దాక్షిణ్యంగా చంపివేయవలె. శ్రీ మహావిష్ణు మూర్తివలె ఆశ్రితులకు అభయం ఇవ్వవలె. సర్వదేవతల స్వరూపం రాజు కాబట్టి, ప్రజలందరూ భక్తి శ్రద్ధలతో పూజించవలె. రాజుపట్ల వినయ విధేయతలు ప్రకటించినవారు రాజు ఆదరణకు గురి అవుతారు, తిరస్కరించిన వారు రాజు ఆగ్రహానికి గురి అవుతారు. కాబట్టి రాజ్యంలోని ప్రతివ్యక్తి రాజు పట్ల వినయ విధేయతలు కలిగి, గౌరవాన్ని ప్రకటించి రక్షణ పొందవలె. రాజు అనుసరించే ధర్మాన్ని బట్టి యుగాల పేర్లు ప్రచారంలోకి వచ్చినాయి. రాజు ధర్మాన్ని సంపూర్ణంగా నిర్వహిస్తే అది కృతయుగమని, ముప్పాతిక భాగం అనుసరిస్తే అది త్రేతా యుగమని, అర్థ భాగం ఆచరిస్తే అది ద్వాపర యుగమని భావన. కలియుగంలో ధర్మం పూర్తిగా విస్మరింపబడుతుంది. రాజరికం నాటి సంప్రదాయం. దైవత్వం ఆపాదింపబడింది కాబట్టి అది సత్సంప్రదాయం.

## దండనీతి :

మహాభారతంలో ధర్మశాస్త్రానికి అనుగుణంగా రాజధర్మ సూత్రాలు. అర్థ శాస్త్రానికి సంబంధించి దండనీతి విషయాలు ఉన్నాయి. ధర్మ శాస్త్రంలో రాజరికానికి ప్రత్యేక స్థానం ఇవ్వబడింది. రాజు నిర్ణయించిన ధర్మసూత్రాలు అమలు పర్చవలెనని వాదిస్తే, ప్రజాభిప్రాయానికి అనుగుణంగా వాటిని తీర్చిదిద్దాలని ప్రతిపాదన, ధర్మశాస్త్ర బద్ధంగా భీష్ముడు రాజనీతి విచారణ చేస్తే, కౌటిల్యుడు అర్థ శాస్త్రంలో ప్రజాను గుణపాలనకు ప్రాధాన్యత ఇచ్చినాడు. భీష్ముడు వ్యక్తిగత అభిప్రాయాలను ప్రకటించలేదు రాజ దైవాంశ సంభూత గుణాన్ని గురించి చెప్పేటప్పుడు, మాంధాతునికి ఇంద్రునికి జరిగిన సంభాషణలో అభిప్రాయాలను వ్యక్తం చేసాడు కౌటిల్యుడు స్వయంగా తన పరిశీలన అనుభవాలను గ్రంథస్థం చేసినాడు. కాని ధర్మశాస్త్రం, అర్థ శాస్త్రం రెండూ రాజధర్మాల గురించి ప్రస్తావించినాయి.

దండనీతి అనేది సామాన్య పౌరులు రాజుకు ఇచ్చిన అసాధారణ అధికారం అని అర్థశాస్త్రం భావిస్తే, భీష్ముడు ఈ సార్వభౌమాధికారం దైవదత్తం అని ప్రకటించినాడు. కురు ఋషి మొదట రాజు కాని, సార్వభౌమాధికారం లేదని అభిప్రాయ పడినాడు. ప్రజలు ధర్మ ప్రవర్తకులై, పరస్పర గౌరవ మర్యాదలతో, శాంతికి భంగం లేకుండా నివసించేవారు. కొంత కాలం గడిచిన పిమ్మట ప్రజల్లో అసూయ, పగ, ద్వేషం లాంటి స్పర్ధలు, విషయ వాంఛలలో పోటీ ఏర్పడినాయి ఈ కారణంగా సమాజంలో శాంతి భద్రతలు కరువైనాయి వేద ధర్మాలను నిర్లక్ష్యం చేసి, అధర్మ ప్రవర్తకులైన ప్రజలను చూసి, బ్రాహ్మణులు బ్రహ్మ దేవునితో మొరపెట్టుకున్నారు. ప్రజాజీవనాన్ని సరిదిద్దవలసిందని దేవతలు సృష్టికర్తను ప్రార్థించడం జరిగింది. బ్రహ్మదేవుడు తన శక్తి చేత ప్రజా సుఖజీవనానికి అవసరమైన వెయ్యి మార్గ సూత్రాలను ప్రతిపాదించినారు. ప్రజా సంక్షేమం కోసం ప్రభుత్వం ఏ విధంగా నిర్వహించబడవలసింది ఆ గ్రంథంలో సూచించబడింది. యుద్ధ పద్ధతులు, ఆయుధాల ఉపయోగం. సంధులు, సమావేశాలు, శాంతి ప్రయత్నాలు, సైనిక శిక్షణ, ప్రజా

సంక్షేమ ధర్మాలు మొదలైనవి సూచింపబడినాయి. దేశక్షేమం కోసం ప్రజలలో ఉండవలసిన సద్గుణాలు వివరించబడినాయి. సర్వ రాజనీతి సారం ఈ గ్రంథమని చెప్పవచ్చు

ధర్మార్థకామ మోక్షాలను ఉద్దేశించి ఈ శాస్త్రం రూపొందించబడింది, సూత్రాల వలన దండం ఉంది. కాబట్టి దీని ద్వారా ప్రజలు సన్మార్గవర్తులై ఉంటారు కాబట్టి దీనికి దండనీతి అని పేరు వచ్చింది. బ్రహ్మ సృష్టించిన ఈ దండనీతి శాస్త్రాన్ని పరమేశ్వర శివ శంకరుడు సంక్షిప్తం చేసాడు. ఈ సూత్రాలను నేర్చుకోవడానికి, కలియుగంలో ఉండగా మానవ జీవిత కాలం సరిపోదని, పరమ శివుడు, శాస్త్ర సూత్రాలను 10 వేలకు కుదించినాడు. ఇంద్రుడు 5 వేల సూత్రాలను తగ్గించివేసాడు. బృహస్పతి మూడువేల సూత్రాలను తగ్గించినాడు. చివరకు అది వెయ్యి సూత్రాలకు పరిమితం అయింది.

## భీష్మ వ్యాఖ్యానం :

బ్రహ్మదేవుని నుండి అందించబడ్డ దండనీతి శాస్త్రాన్ని, భీష్ముడు కాలానుగుణంగా వ్యాఖ్యానించినాడు. భీష్ముని దృష్టిలో రాజధర్మం, దండనీతి రెండూ ఒక్కటే, దండనీతి లేకపోతే, రాజనీతి లేదు. రాజు నిరంకుశంగా ప్రజలను అదుపులో పెట్టడానికి దండం అవసరం. దండనీతిని సక్రమంగా అమలుపరిస్తే, నాలుగు వర్ణాల వారు, వారి ధర్మాలను నెరవేరుస్తారు. ప్రజా సంక్షేమం కోసం దండనీతిని సక్రమంగా ఉపయోగించాలి. సామాజిక భద్రత, వ్యక్తిగత సంక్షేమం రాజధర్మాలు-వీటిని సాధించడానికి దండనీతి అవసరం. శాంతి పర్వం 188వ అధ్యాయంలో రాజు అనుభవించే దండం దైవదత్తం అని చెప్పబడింది. దండం వల్ల, భయంవల్ల ప్రజలు రాజుపట్ల భక్తి శ్రద్ధలు ప్రకటిస్తారు.

## రాజాధికార ప్రాతిపదిక :

రాజాధికారానికి ప్రాతిపదిక మీద కూడా భీష్ముడు వ్యాఖ్యానం చేసినాడు శాంతి పర్వం 59,67 అధ్యాయాలలో రాజరిక పుట్టుక వివరాలు ఇవ్వబడినాయి. యుధిష్ఠిరుడు భీష్ముని రాజరిక పుట్టుక గురించి ప్రశ్నలు అడుగుతాడు. రాజన్ అనేపదం ఎలా పుట్టింది? ఒక వ్యక్తి ఎప్పుడూ మందిని ఎలా పాలించగలడు? సామాన్య మనిషికి ఇవి ఎలా సాధ్యమౌతాయి? ప్రజలందరిలో అతనిపట్ల వినయ విధేయతలు ఎందుకు ప్రకటించాలి? ఈ ప్రశ్నలన్నిటికి జవాబు రాజరిక పుట్టుక వివరాలు.

రాజరిక పుట్టుకకు సంబంధించి దైవాంశ సంభూత సిద్ధాంతం. సామాజిక ఒప్పంద సిద్ధాంతాలలోని భావాల మిశ్రమం ప్రజలను పాలించే ముందు రాజు చేత దేవతలు ప్రమాణం చేయిస్తారు, ఈ ప్రమాణం ఒప్పందం కాకపోయినప్పటికి, రాజు ప్రమాణ ధర్మాలకు బద్ధుడు భీష్ముడు రాజరిక ధర్మాన్నికాక. ప్రజా విధులను కూడా వివరించినాడు. కాని శాంతి పర్వం 67వ అధ్యాయంలో సామాజిక ఒప్పంద సిద్ధాంత ప్రసక్తి ఉంది. మొదట రాజు మను ప్రజలను ధర్మబద్ధంగా పాలించడానికి అంగీకరించగా, ప్రజలు తమ రత్నాల ఆస్థిలో సగ భాగం పంటలో 10వ భాగం రాజుకు ఇవ్వడానికి అంగీకరించినారు. అంతేకాక యుద్ధరంగంలో రాజును అనుసరించగలమన్ని, వివాహానికి కన్యలను సమర్పించగలమని వాగ్దానం చేసారు. కాబట్టి రాజరిక పుట్టుక గురించి వివరణలో సామాజిక ఒప్పంద సిద్ధాంతం ప్రతి పాదించబడిందని చెప్పవచ్చు. రాజ్యపాలనకు, రాజ అధికారానికి ప్రాతిపదిక రాజధర్మం, దండనీతి.

## ప్రజల పట్ల రాజధర్మం :

పాండవ రాజు మొదట అధికారాన్ని అందించిన దేవతలకు కృతజ్ఞత ప్రకటించాలని చెప్పబడింది

బ్రాహ్మణులను గౌరవించాలి. ప్రజలను సంతృప్తి పరచడానికి ఇది తొలిమెట్టు సత్య మతాన్ని రాజు పాటించాలి. సత్య ధర్మాన్ని పాటించడంవల్ల రాజు పట్ల గౌరవం పెరుగుతుంది. 58వ అధ్యాయంలో భీష్ముడు ప్రజా రక్షణ రాజు ప్రథమ కర్తవ్యం అని చెప్పినాడు. ప్రజల నుండి పన్నులేకాక వినయ విధే యతలను గౌరవ మర్యాదలను పొందే ప్రభువు వారికి రక్షణ కల్పించవలెను. అరాచకత్వం నుండి ప్రజలను రక్షించడమే రాజధర్మం. దుష్టులను శిక్షించే సమ యంలో రాక్షసునిగా, ప్రజలను రక్షించడంలో పాలనా పరునిగాను రాజు తన కర్తవ్యాన్ని నిర్వహించవలె. సామాజిక భద్రతను రాజు సాధించవలె.

### రాజరిక దైవత్వం :

స్మృతి సాహిత్యంలో చెప్పిన రీతిగా భీష్ముడు రాజు యొక్క దివ్యత్వాన్ని గురించి విపులీకరించి నాడు. సాహిత్యంలో దైవత్వ భావం లేదు. దేవు నికి సంబంధించిన గుణాలున్నవాడు రాజనే భావం ఇతిహాస యుగంలో ప్రబలింది. దేవుడే రాజు శరీ రంలో ప్రవేశించి, దైవపరంగా ఉత్తమ కార్యాలను చేస్తాడని నమ్మిక ప్రజా సంక్షేమాన్ని నిర్లక్ష్యం చేసిన రాజుపై తిరుగుబాటు చేసే హక్కు ప్రజలకు ఉం టుంది. దైవాంశ సంభూతుడైన రాజు కూడా ధర్మ సూత్రాలకు అనుగుణంగా రాజ్యపాలన చేయాలి.

### ప్రభుత్వ స్వరూపం :

ప్రభుత్వ స్వరూప స్వభావాల గురించి భీష్ముడు యుధిష్ఠరులకు బోధించాడు. రాజ్యపాలనకు సంబం ధించి మరీ క్రూరంగా, మరీ సౌమ్యంగా ఉండ కూడదు న్యాయాన్ని ధిక్కరించిన వారిపట్ల నిర్దాక్షి ణ్యంగాను, గౌరవించే వారిపట్ల ఆదరణ ప్రకటించాలి. శత్రువులను అణచేటప్పుడు కూడా ప్రజారక్షణ దృష్టిలో పెట్టుకొని పని నిర్వర్తించాలి. ధర్మానుసా రంగా నడచుకొన్న రాజు దేవునితో సమానమని, ధర్మ విరుద్ధ ప్రవర్తకుడు నరకానికి పోతాడని భావన. సమ యానుకూలంగా రాజు సమయస్ఫూర్తి, తెలివి ఉప యోగించి, కార్యాన్ని సాధించాలి. నైతిక విలువలకు భంగం రాకుండా రాజు పరిపాలన నిర్వహించాలి. ఆపద్ధర్మం పేరిట అవసరమైతే అసత్యాన్ని పల్కి తన ధర్మాన్ని నిర్వహించవచ్చు.

### బ్రాహ్మణ ఆధిక్యత :

73వ అధ్యాయంలో బ్రాహ్మణులకు సమాజంలో ఇవ్వబడిన ఉన్నత స్థానం వివరించబడి ది. వేదా లను, ధర్మ శాస్త్రాలను అధ్యయనం చేసిన బ్రాహ్మ ణులకు గౌరవ స్థానం ఇవ్వబడింది. ఉత్తమ కులంలో జన్మించినందున, నైవేద్యంలో మొదటి భాగం బ్రాహ్మ ణులకు ఇవ్వబడేది. క్షత్రియుడైన రాజు వీరికి దానాలు, కానుకలు ఇచ్చి వారి ఆశీర్వాదం పొందవలె దేవతలకు సంతృప్తి కలిగించే గుణం బ్రాహ్మణులకు ఉందని భీష్ముడు అభిప్రాయపడినాడు ఇటువంటి ఉత్తమ బ్రాహ్మణులు తప్పుచేస్తే శిక్షించే హక్కు రాజుకు ఉంది.

### రాజ నీతి దౌత్యం-నైతిక ప్రవర్తన ;

27వ అధ్యాయంలో క్షత్రియుని అధికారానికి బ్రాహ్మణుని ధర్మం ముడిపడాలని అప్పుడే రాజ ధర్మం నిలుస్తుందని చెప్పబడింది. శత్రుసంహారానికి బాహుబలానికి తోడు ఆధ్యాత్మిక శక్తికావాలి. కాబట్టి రాజధర్మం వెనుక బ్రాహ్మణ శక్తి ఉంటుంది. శత్రువు బలవంతుడైనప్పుడు కుయుక్తుల ప్రయోగం ఆమోదిం చబడింది. కత్తి, విషం, అగ్నిలాంటి మారణాయుధాల ప్రయోగంలో తప్పులేదు ఆర్థిక క్లిష్టత ఏర్పడినప్పుడు సత్ప్రవర్తకుల ఆస్తిని దోచుకున్న తప్పులేదని భావించబడింది. రాజధర్మాన్ని పాటించేటప్పుడు నీతి సూత్రాలకు విరుద్ధంగా ప్రవర్తించినా తప్పులేదు ధ్యేయం ప్రజా సంక్షేమం అయినప్పుడు, మార్గాలతో నిమిత్తం లేదు. అత్యంత ఆకలితో బాధపడుతు, భుక్తాన్నం లభించని సమయంలో, ఛండాలుడు ఇచ్చిన కుక్క మాంసాన్ని విశ్వామిత్రుడు స్వీకరించినాడు. కాని ఇది ధర్మం కాదు, ఆపద్ధర్మం మాత్రమే.

—×—

బెసెంట్ దివ్యజ్ఞాన కళాశాల
మదనపల్లె–517327.

# షేక్స్పియర్ శేముషీ వైభవం

—పోలా ప్రగడ సత్యనారాయణమూర్తి

## దిమర్చెంట్ ఆఫ్ వెనిస్ :-

తనని అప్పుడప్పుడు అధిక్షేపిస్తున్నాడనే కారణం వలన షైలాక్ అనే యూదుజాతీయుడు, ఏంటొనీ అనే ఒక క్రిష్టియన్ మీద కక్ష పెట్టుకొని ఉంటాడు. ఆసమయంలో తన మిత్రుడైన బెసానియో కొరకు, కొన్ని షరతులకులోబడి షైలాక్ వద్ద ఏంటొనీకొంత ధనం తీసుకుంటాడు గడువు నాటికి ఆధనం తిరిగి ఇయ్యలేక, షరతులప్రకారం తనగుండెదగ్గర నుండి ఒక పౌనుమాంసం షైలాక్ కోసుకోవడానికి సిద్ధం అయితే, ఏంచెయ్యలేని నిస్సహాయస్థితిలో పడతాడు ఏంటొనీ. అప్పుడు బెసానియో భార్యఅయిన పోర్షియా న్యాయవాదిరూపంలోవచ్చి తన యుక్తితో ప్రమాదం తప్పిస్తుంది. స్థూలంగా ఇదీ ఇందులో కథ.

ఫియరెంటినో వ్రాసిన ఇటాలియన్ కథ 'ఇల్ పెకరాన్', ఈనాటకానికి ముఖ్యఆధారం ఇల్ పెకరాన్‌లో అంగుళీయ వృత్తాంతమూ ఉంది అందులో యోదుడే ముఖ్యపాత్రకూడా. అయితే షేక్స్పియర్ ఈ నాటకంలో పోర్షియో అనే మరోముఖ్య పాత్రనికూడాజేర్చి 'జ్యూనాటకా'న్ని పోర్షియో నాటకం'గా మార్చాడు. ఈనాటకంలో చేర్చిన పేటికల వృత్తాంతం'గెస్టారోమనోరమ్' నుండీ, జెస్సికాకథ ఏంథొనీ ముండే వ్రాసిన' జేంటో నుండీ, న్యాయవిచారణకథ అలెగ్జాండర్ సిల్వాయన్‌యొక్క 'దిఆరేటర్' నుండీ షేక్స్పియర్ గ్రహించాడు. నాటకంలో ఎక్కువభాగం మార్లో వ్రాసిన జ్యూ ఆఫ్‌మాల్టానుండి స్వీకరించాడు. అసలీ నాటకాన్ని రాయడానికి సన్నిహితకారణం ఒకటి ఉంది. 1594లో 'లోపెజ్' అనే యూదునికి ఉరిశిక్షపడింది. దేశప్రజల అందరిలోనూ ఆయాదుజాతీయుని కథ ఎంతోసంచలనం రేకెత్తించింది. అందువలన తత్సంబంధమైన ఇతివృత్తంతో నాటకంవ్రాసి, ప్రజలలో రేకెత్తించిన సంచలనాన్ని, తననాటక విజయానికి వినియోగించుకోవచ్చని షేక్స్పియర్ ఈనాటకం వ్రాసి ఉంటాడు.[1]

మైత్రియొక్క గొప్పతనం, ప్రేమయొక్క శక్తి దుర్మార్గంయొక్క పరాజయం, ఈనాటకంలో సమర్థంగా ప్రదర్శితమయ్యాయి. రక్తదాహంగల షైలాక్‌కి కూడా పితృప్రేమ ఉంటుంది అని చూపించడానికి షేక్స్పియర్, జెస్సికాకాథని ఇందులో చొప్పించాడు. ఆఖరున అంగుళీయ వృత్తాంతాన్ని జేర్చి, నవ్వులతో కూడిన సంతోషపూరిత వాతావరణంలో నాటకం పరిసమాప్తిమొనర్చి, దీనిని భావోద్దీప్తప్రమోదాంతనాటకం (Romantic comedy)గా మలిచాడు. లేకపోతే 'Hath not a jew eyes... ' అంటూ మాట్లాడిన షైలాక్ మీద సామాజికులకు సానుభూతి ఏర్పడి చివరికి ఈనాటకం షైలాక్ కష్టగాథ (Tragedy of Shylock)గా అయిపోయి ఉండును. పోర్షియో వల్ల నాటకం దీప్తిమంతం అయింది. తన నిరుపమాన సౌందర్యంతోనూ, నిస్తులమైన వాగ్వైభవంతోనూ, ఆమెనాటకానికి కాంతినీ ఓజస్సునీ ఇచ్చింది. ఆమెకార

1 Narrative and dramatic sources by Bullough.

ణంగానే మొదట ఏంటొనీ ఇబ్బందులకు లోనయ్యాడు. చివరకి ఆమెవల్లనే ఆ ఇబ్బందులనుండి బైటపడ్డాడు.

రిఛర్డ్ II :-

ఆ గ్లచరిత్రని పరిశీలిస్తే కింగ్ జాన్ నుండి హెన్రీ VIII వరకూ మొత్తం 14 గురు రాజులు ఇంగ్లాండుని పరిపాలించినట్లు తెలుస్తుంది వారు వరుసగా (1) జాన్ (2) హెన్రీ III (3) ఎడ్వర్డ్ I (4) ఎడ్వర్డ్ (5)ఎడ్వర్డ్III (6) రిఛర్డ్II (7) హెన్రీIV (8) హెన్రీ V (9) హెన్రీ VI (10) ఎడ్వర్డ్ IV (11) ఎడ్వర్డ్ V (12) రిచర్డ్ III (13) హెన్రీ VII (14) హెన్రీ VIII వీరిలో క్రిందగీతగా గుర్తుపెట్టిన ఎనుగురు రాజులపై కలిపి మొత్తం పది నాటకాలని షేక్స్పియర్ వ్రాశాడు.

జాన్ నాటకాన్ని అటుంచితే రిఛర్డ్ II నుండి హెన్రీ VII వరకుగల వంద సంవత్సరాల ఆంగ్ల చరిత్రని (1398-1485), కొద్దిమినహాయింపులున్నా, దాదాపు అవిచ్ఛిన్నంగానే, తననాటకాలలో షేక్స్పియర్ పరామర్శించాడు. మధ్యలో కొందరు రాజులపై నాటకాలు వ్రాయకపోవడానికి జాతిజడిపించుకున్నకు, వారిపరిపాలన ప్రతిబింబం కాకపోవడమే, బహుశః కారణం కావచ్చును. లేదా, ముందు వెనకలనున్న రాజుల పరిపాలన, వాటిప్రభావపరిణామాలు ప్రస్తావితమయ్యాయి కనుక, తక్కిన ఆ రాజులపై నాటకాలు వ్రాయనవసరంలేదని తలపోసిఉండవచ్చును.

షేక్స్పియర్ వ్రాసిన 10 చారిత్రక నాటకాల లోనూ, చారిత్రకదృష్ట్యా మొదటిది చివరది అయిన కింగ్ జాన్ హెన్రీ VIII లను అటుంచి, తక్కిన అయిదుగురు రాజులపై వ్రాసిన 8 నాటకాలనీ వేరుగా పరిశీలించాలనీ ఈ 8 నాటకాల సమూహాన్నీ 'నాటక రూపంలో వ్రాసిన ఆంగ్లేయ జాతీయ ఇతిహాసము (Dramatised national epic of england) అని వ్యవహరించ తగుననీ ప్రొఫెసర్ శ్రీనివాస అయ్యంగారు అన్నారు.

కింగ్ జాన్ రిఛర్డ్ II లపై షేక్స్పియర్ నాటకాలు వ్రాయులేదు తన సమకాలీనులైన పీల్, మార్లోవంటి రచయితలు, ఎడ్వర్డ్ I ఎడ్వర్డ్ II లపై అప్పటికే నాటకాలు వ్రాసి ఉండడంవల్లనో, లేక తనని ఆకర్షించి ఉత్తేజితుణ్ణి చేయగలఘట్టాలు ఆయా రాజుల కాలంలో కన్పించకపోవడంవల్లనో, ఆనలుగురు రాజులపై వ్రాసిఉండడు.

ఇంక రిచర్డ్ II నాటకం సంగతి. అతను రాజ్యం చేసినకాలం 17 మాసాలు మాత్రమే! (Sep 1398 to Feb. 1400, 'ఉడ్‌స్టాక్' ప్రభువుని హత్యచేశారనే అనుమానంతో, బూలింగ్‌బ్రూక్‌ని ఆరుసంవత్సరాలూ, మాబేపు యావజ్జీవమూ, దేశబహిష్కరణ చేసి డ్యూక్‌ఆఫ్ యార్కుని ఇంగ్లండులో గవర్నరుగా నియమించి, తాను ఐర్లండు వెళతాడు రిఛర్డ్ II. అతను ఐర్లండునుంచి తిరిగివచ్చేటప్పటికి, తనకినార్త్ అంబర్‌లాండ్, హాట్స్పర్, ఎర్ల్ ఆఫ్ వర్ సెస్టర్లు సహాయంచెయ్యగా. బాలింగ్‌బ్రూక్ సైన్యంతోదండెత్తి వచ్చి ఆంగ్లసింహాసనాన్ని ఆక్రమించుకుంటాడు. ఆక్రమించుకొని, హెన్రీ IV గా రాజ్యాభిషిక్తుడై, రిఛర్డ్ II ని బంధించి చంపిస్తాడు.

ఇది ఒక విధంగా రిచర్డ్ చేసిన పొరబాట్లనీ అందుకు అతడు పడిన అగచాట్లనీ తెలిపే విషాదాంత నాటకం. ఈనాటకంలో ఎక్కడా వచనం కనిపించదు. ఆద్యంతమూ పద్యాత్మకంగా నడుస్తుంది శ్లేషాలంకారాలమీదా, శబ్దాడంబరాలమీదా షేక్స్పియర్‌కి ఇంకా వ్యామోహం తగ్గలేదనడానికి ఈనాటకం ఒకసాక్ష్యం. రిఛర్డ్ వాక్శూరుడు, బాలింగ్ బ్రూక్ క్రియాశీలుడూను. ఆ సంగతి సూచించడానికో అన్నట్లు రిఛర్డ్‌నోట కమనీయమైన కవిత్వాన్ని బాలింగ్ బ్రూక్ నోట జనాకర్షణీయమైన వాక్ చమత్కారానీ ప్రవేశ-

పెట్టాడు షేక్స్పియర్. పాత్రోచితమైన భాషని ఉప యోగించలేదు తోటమాలికూడా పండితునిలాగె సమ కాలీనరాజకీయ పరిస్థితులకి అన్వయించేలాగ ధ్వని ప్రధానంగా, ఇలా అంటాడు.

"Cut off the heads of too fast growing sprays that look too lofty in our commonwealth.

III—iii—33

హెన్రీ IV-1, 2, భాగాలు :-

రిచర్డ్ II తర్వాత రాజ్యానికి వచ్చిన బొలింగ్ బ్రూక్ హెన్రీ IV అనే పేరుతో రాజ్యాన్ని ఏలాడు. అతనిపేరుమీద హెన్రీ IV పార్ట్ II అని రెండు నాటకాలు రాశాడు షేక్స్పియర్, ఇందులో మొదటి భాగంది ఒక సంవత్సరం కథ. రెండోభాగంలోది పది సంవత్సరాలకు సంబంధించింది. అంతర్యుద్ధము, తండ్రీ కొడుకులైన హెన్రీ IV హెన్రీ V ల మధ్యగల మనోభావవైఖరీ, ఈరెండింటినీ ముఖ్యకథా భాగాలుగా తీసుకుని, వీటికి చారిత్రక సత్యాలని జోడిస్తూ చక్కని నాటకీయతకి అనుకూలంగా షేక్స్పియర్, హెన్రీ IV 1, 2 భాగాలుగా వ్రాసిన ఈరెండు నాటకాలనీ మలచుకొన్నాడు.

1భాగములోని సమస్య, కొడుకుని తనకి తగిన వారసునిగా తయారుచేయుట ఎట్లా అని హెన్రీ IV ఎదుర్కొన్న ఇబ్బంది పరిస్థితి. దాన్ని పరిష్కరించబోయేసరికి 2వభాగంలో మరికొన్ని కొత్తసమస్యలు తలెత్తాయి. అసలు 2వ భాగాన్ని వ్రాయాలని మొదట షేక్స్పియర్ అనుకోలేదని, అందుకే 2వ భాగంలో పటిష్టమైన నిర్మాణకౌశలం కన్పించదనీ ఆర్. ఎ. లా. అన్నారు. కాని అతనని టిలి యార్డ్[1] డోవర్ విల్సన్[2]లు అంగీకరించలేదు. హెన్రీ IV 1, 2 భాగాలు ఒకదానితో ఒకటి విడదీయరాని భాగాలనీ, వాటిమధ్య అన్వయం, సామరస్యం ఉన్నాయనీ నొక్కి వక్కాణించారు.

రిచర్డ్ II నాటకంలో గెన్ డవర్ ప్రస్తావనా బొలింగ్ బ్రూక్ కుమారుని ప్రస్తావనా రావడంవలన, ఆనాటకానికీ హెన్రీ IV 1వ భాగానికి ఎటువంటి సంబంధంవచ్చిందో, అటువంటి అనుబంధమే, హెన్రీ IV Part 1లో స్క్రూప్ ప్రస్తావన రావడంవల్లా, నార్తంబర్ లాండ్ గురించి రిచర్డుఅన్నమాటలను హెన్రీ IV జ్ఞాపకం తెచ్చుకోవడంవల్లా హెన్రీ IV 1వ భాగానికీ హెన్రీ IV 2వ భాగానికీ వచ్చింది 1వ భాగాన్ని, విశిష్ట గుణములున్నా వాటిని హద్దుల్లోఉంచుకోలేకపోయిన హాట్స్పర్ విషాదగాథగానూ, 2వ భాగాన్ని చేసిన పాపాలకి పశ్చాత్తప్త హృదయంతో బాధపడిన హెన్రీ IV విషాదగాథగానూ పరిగణిస్తే ఈరెండు నాటకాలూ విషాదాంత నాటకాలుగానే కనిపిస్తాయి. యాగ్నికోర్టు. వీరుడైన హెన్రీ Vగా రూపొందడానికీ, హెన్రీ IV మరణానికి, ఫాల్స్టాఫ్ని హెన్రీ V త్యజించడానికీ భూమికగా ఉపయోగించబడింది, హెన్రీ IV Part II నాటకం అంతేకాదు. హెన్రీIV Part I నకూ, హెన్రీVనకూ మధ్యవారధిలాకూడా కనిపిస్తుంది. అయితే 1వ భాగంలో ఉండే స్వయం వ్యక్తిత్వమూ నిర్మాణసౌష్టవమూ 2వ భాగంలో లోపించాయి.

ఈరెండు హెన్రీ IV నాటకాలలోనూ తటిల్లతలా తళతళ మెరిసే పాత్ర ఫాల్స్టాఫ్. అతనిముందు తక్కిన అన్నిపాత్రలూ కళాహీనాలు, ఆకర్షణ రహితాలు, వ్యక్తిత్వ విరహితాలు. ఇది షేక్స్పియర్ యొక్క అద్భుతపాత్ర సృష్టికి అపురూపమైన ఉదా

1. Shakespear's history plays- By Tilyard
2. The forlines of falstaff — by dover wilson.

హరణ. ఫాల్‌స్టాఫ్‌ని చూచినకొద్దీ చూడాలనీ; అతని పనులు గమనించిన కొద్దీగమనించాలనీ అనిపిస్తుంది. ఇలాఅనిపించడం ఏఒక్కతరగతి ప్రేక్షకులకోకాదు అన్నితరగతుల ప్రేక్షకులని అలరించేపాత్రఅది. యువకుడైన హెన్రీ Uకి అతను స్నేహితుడు. హెన్రీ V యొక్క బాధ్యతారహితమైన జీవితానికి ఫాల్‌స్టాఫ్ కారణమని, హెన్రీ IV తో బాటు కొందరు సామాజికులు కూడా అనుకుంటే అనుకుందురుగాక! కాని హెన్రీ U కి జీవితంలోని సరదాలతోబాటు సమస్యల్నికూడా చూపించి, జీవితానికి బొమ్మా బొరుసూరెండూ ఉంటాయని తెలియపరచి, లోని మానవీయతని జ్వలింపజేసి, సంస్కారవంతుని గా తీర్చిదిద్దినది ఫాల్‌స్టాఫే! కొందరు విమర్శకులు ఫాల్‌స్టాఫ్‌ని దుర్మార్గుడుగా చిత్రించి పాఠకులలోనూ ప్రేక్షకులలోనూ అతనంటే ద్వేషభావం ఏర్పడేలా చేశారు కాని అది అన్యాయం. అతడేమీ హంతకుడు కాదు. ఇతరులను హింసించి ఆనందించేవాడూకాదు. దురాశాపరుడు అసలేకాదు. తానునవ్వుతూ, ఇతరులను నవ్విస్తూ పదిమందినీ తనప్రభావంలోకి ఆకర్షించే ఒక నిరపాయమైనవ్యక్తి ఫాల్‌స్టాఫ్ అబద్ధాలపుట్ట అని ఒక విమర్శ ఉంది. అతని అబద్ధాలన్నీ ఇతరులను నవ్వించడానికేగాని మరెందుకూగాదు. సత్యాన్ని అతను ఎలా అంగీకరిస్తాడో ఈమాటలవల్ల తెలుస్తుంది.

"Dost thou hear hal ? Thou know- in the state of innocency adam bull; and what should poor jack falstaff do in the days of villaing ? Thou senst i have more than another man and therefore more brailty"-

'డౌగ్లస్'ను ఎదిరించలేక పడిపోయి చనిపోయినట్లు నటించాడు కనుక ఫాల్‌స్టాఫ్ వట్టిపిరికివాడని కొందరి విమర్శ. సమయంకలిసిరానప్పుడు, వివేకంతో ప్రమాదంనుంచీ బయటపడడం పిరికితనం ఎలా అవుతుంది, ట్రోయ్‌యుద్ధంలో 'ఎఛిలిస్' తరుముతూంటే హెక్టర్ అంతటివాడు పారిపోలేదా ? అంతమాత్రాన హెక్టర్‌ని భీరువుఅంటామా? ఇంతకీ ఫాల్‌స్టాఫ్‌కి వీరులన్నా వీరత్వం అన్నాగౌరవం లేకపోతేగదా! ఒక స్వగతంలో "Prince harry is valant....., he is become very hot and valiant" అన్నాడు అతనులేకపోతే హెన్రీ 1U నాటకాలు రెంటూబుద్ధిరసహీనమైన ప్రదర్శనాలు. అందులోని కథఅంతా తిరుగుబాటులూ యుద్ధాలూ వీటిలోనిండినదే ఎన్నిప్రమాదాలనైనా చిరునవ్వుతో ఎదుర్కొనే ఫాల్‌స్టాఫ్ చివరికి ప్రాణసఖుడైన హెన్రీయువరాజు తనని త్యజించేసరికి భరించలేని ఆవేదనకి లోనవుతాడు. "యువరాజూ, అతనితోబాటు షేక్స్పియరూకూడా ఫాల్‌స్టాఫ్ పాతని పరిత్యజించడం, అన్యాయం. అని మూర్గన్ అన్నాడు. "మేక్‌బెత్, హేమ్‌లెట్‌ల స్థాయికిచిత్రించిన ఫాల్‌స్టాఫ్‌ని ఎంతో నిర్వికారంతో త్యజించి షేక్స్పియర్ అద్భుతమైన సంయమనాన్ని ప్రదర్శించాడ"దని బ్రాడ్లీ అన్నాడు. "రాజుగా తనవిధులను నెరవేరుస్తూ, విద్యుక్తధర్మాన్ని పటిష్టంగాపాటించాలంటే, తన కత్యంత ప్రియతముడైన ఫాల్ స్టాఫీని త్యాగం చెయ్యక తప్పదు అలాంటి ఉన్నతమైన త్యాగం చేసి హెన్రీ వి. యువరాజు మరింత మహోన్నతుడయ్యాడని Stewart తన character and motive in Shakes Peare అనే గ్రంగంలో అన్నాడు

## మచే ఎడూ ఎబౌట్ నథింగ్ :

జీవితాన్ని తరచి చూస్తే మానవుడు పడుతూన్న తాపత్రయం, అతను చెందుతూన్న ఆవేదనా, అంతా అపహాస్యంగా కనిపిస్తుంది. కాని అంత చులకనగా తీసివేయదగినదికాదు జీవితం. అద్భుతమైన ప్రేమా, అకారణమైన ద్వేషమూ, కన్నీటి బిందువులూ పన్నీటి చిందులూ, మేధోజనిత దివ్యదీధితులూ, హృదయోద్గత దివ్యానుభూతులూ, కాంతిని వర్షించే సత్యం, భ్రాంతిని

కల్గించే అసత్యం - వీటి అన్నిటి సమ్యక్ సమ్మేళనమే జీవితము. ఇట్టి జీవితం యొక్క సమగ్ర స్వరూపాన్ని, ఈ నాటకమందు షేక్స్పియర్ మనకి అందించి, మనం పడుతూన్న తాపత్రయం ఎంత అర్థ రహితమైందో తెలియ పరిచాడు అందుకు అనుగుణంగా, "ఏం లేనిదాన్ని గురించి ఎంత హడావిడి!" అని నాటకానికి పేరు పెట్టాడు.

ఈ నాటకంలో ప్రముఖంగా కనిపించేది నిర్మాణ సౌష్ఠవం ఒక జంట (హీరో, క్లాడియో) మొదట అమితంగా ప్రేమించుకొని తర్వాత విపరీతంగా వివాదంలోకి దిగుతారు. మరో జంట (బియాట్రిస్, బెనడిక్) వివాదంతో ప్రారంభించి వివాహ వేదికను చేరుకుంటారు. ఓ జంట తగవులాడుకుంటూంటే మరో జంట వారి మధ్య సామరస్యం ఏర్పడేలా ప్రయత్నిస్తూ ఉంటారు. జీవితాలని కలపడానికి అన్నగారు (డాన్ పీడ్రో) ప్రయత్నిస్తూ ఉంటే, విడదియ్యడానికి తమ్ముడు (డాన్ జాన్) ఉద్యుక్తుడవుతాడు. ఈ నాటకంలో హీరో అనే పేరుగల కథా నాయిక జీవితాన్ని, అకారణవైరం పూని డాన్ జాన్ నాశనం చేయబోయేసరికి, ఇది విషాదాంత నాటకంగా (మర్చెంట్ ఆఫ్ వెనీస్‌వలె) మారే ప్రమాదం ఏర్పడింది. మర్చెంట్ ఆఫ్ వెనీస్‌లో పోర్షియా తెలివితేటలు ఆనాటకాన్ని ఆప్రమాదం నుంచి తప్పిస్తే, ఇందులో డాగ్ బెర్రీ మూర్ఖం ఈ నాటకాన్ని అటువంటి ప్రమాదం నుంచి తప్పించింది. ఈనాటకంలో 'బియాట్రిస్', 'డాగ్‌బెర్రీ' పాత్రలు ప్రముఖమైనవి.

'హీరో'వలె 'బియాట్రిస్' ప్రథమ వీక్షణంలోనే ప్రణయామృతాన్ని వర్షించలేదు. మొదట్లో బెనడిక్ నేపట్ల ఆమె ఉదాసీనంగా ఉంది. తర్వాత ఎన్ని పరీక్షలలోనో నెగ్గి ఆమె ప్రేమ, చివరకి వచ్చేసరికి తప్త కాంచనంలా ధీధితుల్ని వెలార్చింది. సరిగ్గా వివాహ సమయంలో క్లాడియో హీరోని అవమాన పరచినప్పుడు అంతా దిక్కుతోచక దుఃఖిస్తూంటే, బియాట్రిస్ ఒక్కత్తే హీరోకి బాసటగా నిలిచి అచంచల విశ్వాసంతోనూ పట్టుదలతోనూ వ్యవహరించి ఆమె జీవిత మార్గాన్ని తీర్చిదిద్దింది. వ్యర్థప్రలాపాలు పలుకుతూన్న బెనడిక్‌ని కూడా తన చాకచక్యంతో మార్చి న్యాయానికి బాసటగా నిలిచే యోధునిగా తయారు చేసింది. అసలు తక్కువా, ఆర్భాటం ఎక్కువా (Much Ado about nothing) ఉండే ఈ లోకంలో, గడుసు దనంతో మంచి తనాన్ని జోడించే ప్రజ్ఞావంతులైన ఉత్తమ ఇల్లాండ్రు ఎంతో అవసరమని ఈ పాత్ర ద్వారా తెలియపరిచాడు షేక్స్పియర్, మగవాళ్ళు నేరం చేస్తే క్షమించడానికి ఈమె 'హీరో' స్త్రీకాదు. వాళ్ళని మందలించి, బెదిరించి అదరించి సరిదిద్దే వనిత ఈమె. డాస్టవిస్కీ నవలలోని ఫిలిప్పోవ్నా వంటి పాత్ర.

డాగ్ బెర్రీ ఓరకంగా తెలివైనవాడూ, ఓరకంగా మూర్ఖుడూను. అర్థం తెలియకుండా వ్యర్థపదాలుపయోగించి నాటకానికి వాస్తవ వాతావరణంతో బాటు హాస్యాన్ని కూడా సమకూర్చిపెట్టిన ఇతగాడు, డాన్ జాన్ కుట్ర ముందే కనుగొన్నాడు కాని. ఆ కుట్ర హీరో పొందిన తర్వాతగాని, ఆ కుట్ర ఏమిటో పదిమందికీ చెప్పకుండా ఊరుకున్నాడు. అందుకే అనవలసివచ్చింది తెలివైనవాడూ, మూర్ఖుడూ కూడా అని. రహస్యం తెలిసీ, దానిని డాగ్ బెర్రీ ఉపయోగించకపోవడంతో, నాటకానికి ఒక లబ్ధి ఏర్పడింది. సామాజికులలో ఉత్కంఠ కలిగించింది. హీరో

పట్ల సానుభూతి ఏర్పడింది. ఈ రెండూ ఏర్పడడానికి అనువుగా తెలివినీ, మూర్ఖాన్నీ సమంగా పంచుకొన్న ఒక విచిత్రమైన పాత్రని షేక్స్పియర్ సృష్టించాడు.[1] డాగ్‌బెర్రీవంటి మూర్ఖుడూ, బియాట్రిస్ వంటి వివేకవతీ ఇద్దరూ జీవితానికి అవసరం అనుకున్నాడు షేక్స్పియర్. అందుకే, బెండెవో వ్రాసిన టింబ్రియోఅండ్ ఫెనీషియో, ఆరియస్టో వ్రాసిన 'ఆర్లెండో ఫ్యూరిసో' అనే రెండింటినుంచి ఈ కథని తీసుకున్నా, వాటిలోని బియాట్రిస్‌కి కాంతిమయమైన క్రొత్త రూపాన్ని ఇచ్చి వాటిలో లేని డాగ్‌బెర్రీ పాత్రని సృష్టించాడు. అంతే కాదు. బెనడిక్ బియాట్రిస్ కథని ప్రధానకథని చేశాడు.

1. John palmer :- Comic charectors of Shakes Peare-1946.

## —పరీక్షా ఫలితాలు—

1983ఆగస్టులో జరిగిన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్రభాష పరీక్షల పరీక్షా ఫలితాలు ది 5 అక్టోబరు 1983 లోపున ప్రకటించి, ఆ వివరాలు హిందీపండితులకు పోస్టులో పంపుటకు ఏర్పాట్లు జరిగినవి.

## —హిందీ పరిచయ పరీక్ష—

దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర స్వర్ణోత్సవ పరిచయ పరీక్ష ది. 20 నవంబరు 1983 నాడు జరుగును. అందుకు సంబంధించిన నియమావళి ప్రకటించబడినది. అక్టోబరు 20వ తేదీ నాటికి పరీక్షార్థుల పట్టిక ఆంధ్ర సభకు పంపవలెను. పరీక్షా రుసుము రు. 5-00లు. పరీక్షార్థులకు హిందీ పరిచయ పుస్తకం ఉచితంగా అందజేయబడును. వివరములకు ఆంధ్ర సభకు వ్రాయవలెను.

విశేషాధికారి

# హిందీ సాహిత్యంలో మహనీయ మహిళ- మహాదేవి

డా॥ శ్రీమతి పి. మాణిక్యాంబ

(జ్ఞానపీఠ్ బహుమతి అందుకున్న సందర్భంలో)

ఆధునిక హిందీ సాహిత్యములో శ్రీమతి మహాదేవి వర్మ ఒక మహాకవయిత్రి. మహాదేవిలాంటి మహతీ సాహితీ ప్రతిభగల కవయిత్రి విశ్వసాహిత్య ప్రాంగణంలో కూడ అరుదుగా కనిపించునేమో! ఆమె మౌలిక ఆలోచనా సరళిలో, అనన్య సామాన్యమయిన కల్పనా శక్తిలో తనకు తానే సాటి. కావ్యంలోని భావజగత్తును రసమయం చేయటమే కాక గద్యంలోని వైచారిక క్షేత్రంలోకూడ ప్రతిభ అనన్యము. ఆమె సమస్త సాహిత్యంలో నారీ హృదయ స్పందన స్పష్టంగా ప్రతిధ్వనిస్తూ ఉంటుంది. ఆమె కవిత్వంలోని ప్రతిపదం అత్యంత సరస మృదుమధురమై హృదయాంతరాళలో ఆవరిస్తుంది.

ఉత్తర ప్రదేశ్‌లోని ఫరూఖాబాద్‌లో సాహిత్య మహాదేవి హోలీపూర్ణిమ రోజున జన్మించినది. రంగులతో విలసిల్లే పర్వదినంనాడు జన్మించడంవలన దీని ప్రభావం ఆమె జీవితంలో కూడ కన్పిస్తుంది. విశ్వజనీనభావము-ఆమెసాహిత్యము యొక్క ఆత్మ. వివిధమైన రంగుదారాల అపూర్వ సమ్మేళనము. భావకవి గద్యంలో యదార్థవాది, సంస్మరణ రచయిత్రి, సమన్వయ దృష్టిగల విమర్శ చేయగల సామర్థ్యంగల వ్యక్తి, సుందర లలితవ్యాసాలు రాయటంలో అందెవేసిన చెయ్యి, ఉన్నతశ్రేణికి చెందిన చిత్రకారిణి, నిస్వార్థసమాజసేవ మరియు, దేశసేవ ఆదర్శాలుగాగల మహనీయురాలు.

చిన్నతనం నుండి కుశాగ్రబుద్ధిగల మహాదేవి చిన్ననాటినుండే సాహిత్యరచన చేయసాగినది. చిన్న కవితలతోపాటు వ్యాసరచనలో కూడ మహాదేవి సునిశితమైన భావాలను వ్యక్తంచేయగలిగిన ప్రజ్ఞగలవ్యక్తి. ఉపేక్షకు తిరస్కారానికి గురిఅయిన నారీ జాతికి జరిగిన అన్యాయాలు, అత్యాచారములకు వ్యతిరేకంగా ఈ వ్యాసాలలో మహాదేవి ఆక్రోశం వ్యక్తమయింది. నీహార్, రశ్మి, నీరజ, సాంధ్యగీత్, దీపశిఖ మరియు సప్తపది ఆమె కావ్యరచనలు. శృంఖలాకీ కడియాం అతీత్ కేచలచిత్ర మరియు పథకేసాథీ వారి ముఖ్య గద్యరచనలు. సాంధ్యగీత్ ప్రచురణలో మహాదేవి చిత్రకారిణిరూపం ప్రస్ఫుటమయింది. ప్రతికవితకు భావానురూపమైన చిత్రముగూడ ఇందు పొందుపరచటం జరిగింది. గీతికావ్యం కావటంతో సాంధ్యగీత చిత్రకళ, సంగీతము మరియు సాహిత్యములు సంగమము. దీపశిఖ అనే కావ్యకృతిలో కూడ భావానురూపమైన చిత్రాన్ని కూడ పొందుపరచటంతో కావ్యసౌందర్యం ద్విగుణీకృతం అయింది ఇదిచూసి కావ్యమయమైన చిత్రమా, చిత్ర గీతమా అనిపిస్తుంది. ఇందులోని ప్రతిచిత్రం కావ్యసౌందర్యానికి ఇంకాచామరత్వాన్ని చేకూర్చింది.

మహాదేవి కావ్యంలోని ముఖ్యమైన భావం— ప్రణయం. అరూపుడు, అనంతుడు అంతర్యామిఅయిన అపరబ్రహ్మ ఆమె పరమప్రియుడు. ఆత్మపరమాత్మల సనాతన భావానుబంధం అది. తెలుగులోనిభావ కవిత్వ

ధోరణులు ప్రవృత్తులు హిందీలో ఛాయావాద కవిత్వ మనకు సమకాలీనమయినది. శ్రీ జయశంకర ప్రసాద్ నిరాలా, పంత్‌లతోపాటు మహాదేవికూడ ఈ కోవకు చెందినదే! ప్రకృతిలో అవలంబించే, పరమపురుషుని తెలుసుకోవాలని ఔత్సుక్యం, ప్రకృతి సౌందర్యంలో పరమాత్మను చూచుట. పవిత్ర ప్రేమభావన, స్వానుభవాలను కావ్యంలో వర్ణ్యవిషయాలుగా తీసుకోవటం ఈ కవుల విశేషధోరణి.

ఆధ్యాత్మిక తత్వచింతన ప్రకారం జీవితం వియోగ మయం మహాదేవి కావ్యంలో ఈ వియోగభాగమే భావపూరితమై వ్యక్తమయింది. సృష్టికిముందు పర బ్రహ్మ తన ఒంటరితనము భరించలేక విశ్వసించిన పరిణామమే మనుష్యుని జీవితము. విరహబాధతో కండ్లనుండి ప్రవహించే అశ్రుబిందువులు ఆ పరమాత్మ కానుక. పరమాత్మ జీవాత్మకు జీవితాన్ని దానంగా ఇచ్చాడు జీవాత్మ కృతజ్ఞతాపూర్వకంగా ప్రేమసౌరభ పూరితమైన హృదయ కమలాన్ని చరణాలపై అర్పించింది. ఈ విరహవ్యథలో నిరాశా నిస్పృహలకు తావు లేదు. ఎందుచేతనంటే భావమూలమైన సాధన, అద్వైత మూలమైన ఆరాధన కారణాలవల్ల మధురమైనదిగానే ఉంటుంది. ఈ మాధుర్య పూరితమైన వేదనాభావ వర్ణన మహాదేవి కావ్యలాలిత్యానికి ఆయువుపట్టు. పరమాత్మపై అనన్యప్రేమ, విరహంలోని వేదనానుభూతితో సాధనా పథంలో జీవాత్మ తనను విశ్వమయంగా ఊహించుకుంటుంది. సుఖదుఃఖపూరితమైన సగపూర్ణ జీవితాన్ని సంతోషంతో స్వీకరించి దాని ముందు మోక్షముకూడ నిరాకరిస్తుంది. పరమాత్మలో ఐక్యమైన తర్వాత విరహానుభూతి లేదు. సాధన మరియు ఆరాధన అవసరము లేదు. అందుచేత భవ భవబంధాలతో నిండిన జీవితమే ఆమెకు ప్రియమైనది. సాధనాపథంలో ఎదురైన కష్టాలను ఆమె భయపడదు సరికదా వాట్లలో ఆమెకు ఆత్మీయతాభావం కనిపిస్తుంది. విరహజ్వాలలేని జీవితం జీవితమే కాదు. మహాదేవి కావ్యం వేదన, త్యాగము, కరుణ మొదలైన పవిత్ర భావాలతో నిండి ఉన్నది. ఈ వేదనజీవితంలో ఏ లోటూ వలన కాకుండా భావాత్మకమైన సాధన మరియు ఆరాధనకు భూమిక వంటిది.

అనంతము మరియు అచంచలము అయిన స్నేహ భావము, మమత అగాధమైన కరుణాభావము ఆమె ఆమె జీవనస్రవంతిలోని భావవీచికలు. కర్మయోగ పూరితమైన జీవితము, భావమయమైన సాహిత్యము ఆమె వ్యక్తిత్వములోని సమన్వయ స్వభావమునకు తార్కాణము. భారతీయ మహిళలు సమాజంలో అత్యంత దుర్భర పరిస్థితులలో జీవితము గడుపు చున్నారని, దానికి కారణము వారి నిరక్షరాస్యతేనని ఆమె అభిప్రాయపడినది అందుచేత స్త్రీలకు మంచి విద్యావకాశములు అవసరమని ఆమెకు తోచింది. ప్రయాగలో మహిళా విద్యాపీఠం ఆమెకృషికి ఫలితం వల్లనే స్త్రీవిద్యాక్షేత్రంలో మంచిఖ్యాతి గాంచినది. ప్రయాగలో సాహిత్యక్షేత్రానికి సంబంధించిన కవులు మొదలైనవారికి వసతికి వీలుగ సాహిత్యకార్ సంసద్ భవనము ఏర్పాటుకు కృషిచేసి దానిని రూపొందించినది. 1950లో అన్ని భారతీయ భాషలలోని సాహిత్యకారులను ఒకచోట సమావేశపరచి పరస్పరం చర్చించుకునే అవకాశం కల్గించుటకు సభను ఏర్పాటు చేసింది ఈ సాహిత్య శిబిరములో పాల్గొనుటకు ఆసమయంలో మన రాష్ట్ర ఆస్థానకవియైన శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఆహ్వానమునందుకొని ప్రయాగ వెళ్ళుట జరిగినది. శ్రీపాద కృష్ణమూర్తిగారు మహాదేవిని ఈ విధంగా ప్రశంసించారు—"మీరు మూర్తీభవించిన మానవత్వం అనడంలో అతిశయోక్తిలేదు." ఆమె పేరును సార్థకం చేసుకున్న మహనీయ మహిళ—మహాదేవి.

56/2. ఆర్. టి.
విజయనగర్ కాలనీ
హైదరాబాదు

# మినీకవిత- ఒక పరిశీలన

ఎస్. రత్నశేఖర్ [రత్నశ్రీ]

ఈ మధ్య 'మినీ కవిత' అనే ప్రక్రియ తెలుగు సాహితీ వియత్తలంలో ఒక ధృవతారగా నిలిచింది. ప్రాచీన కాలం నుంచి ఈ మినీ కవిత ఉంది, అయితే ఈనాడు దానికి అగ్రతాంబూలం ఇచ్చి ప్రోత్సహించారు. బహుళ ప్రాచుర్యం కల్గించారు ఈ ప్రక్రియను ప్రముఖ సాహితీ వేత్తలు కూడా చేపట్టి సుందరంగా, సుకుమారంగా, సులభగ్రాహ్యంగా వ్రాసి ప్రజలందరి మన్నన పొందారు. 'మినీ కవితగ' సున్నితమైన భాషలో, సుందరమైన భావ వ్యక్తీకరణతో, సామాన్యుని మనస్సుకు హత్తుకునేట్లు చేసే వ్యంగ్య లక్షణం ఉన్న ప్రక్రియ ఇది.

తెలుగులో శతకాలు, పర్షియన్‌లో రుబాయిలు, హిందీలో దోహాలు రూపేణా చిన్న చిన్న పద్యాలొస్తున్నాయి. ఆయా పద్య లక్షణాలు మినీ కవితా లక్షణాలకు దగ్గరగా ఉన్నాయి. మినీ కవితల లక్షణాలలో ముఖ్యంగా క్లుప్తత, ఆత్మపరత, నవ్యబంధుర శైలి, భావాధిక్యత చమత్కారం ఉండాలి. వ్యర్థ పదాలు, పునరోక్తులు లేకుండా సూటిగా, గుండెల్లో కినీటుగా, నాటుకు పోవాలి. చమత్కారంతో, క్లుప్తంగా, మనోహరంగా భావాని వ్యక్తీకరిస్తూ భాషాభేషజాన్ని వదిలి సామాజిక స్పృహ కల్గి రచన సాగించడం ఒక లక్షణం.

ఈనాడు 'మినీ కవిత'ను ఒక విప్లవంగా భావించి, ఒక ఉద్యమంగా తలంచి, అనేక ప్రముఖ పత్రికలు, దీన్ని ప్రోత్సహిస్తున్నారు. 'మినీ కవిత' ఆధునిక సాహిత్యంలో ఒక భాగము. దీన్ని "బహుళార్థ సాధక కవిత" అన్నారు. శ్రీరావి రంగారావుగారు. ఆధునిక వచన కవితలు ఏ లక్ష్యాలు నెరవేరుస్తున్నాయో అవే లక్ష్యాల్ని ఈ కవితలు కూడా నెరవేరుస్తాయి. ఇక్కడ ఒక విషయం ఏమిటంటే పెద్ద కవితలకు సూక్ష్మ రూపం 'మినీ కవితలు' అనే భావన ఆమోద యోగ్యం కాదు. పెద్ద కవిత వ్రాయలేక చిన్న కవితలు వ్రాస్తున్నారని, పత్రికల్లో పెద్ద కవితలు ప్రచురించడానికి ఎక్కువ స్థలాన్ని కేటాయించలేక మినీ కవితలు ప్రచురిస్తున్నారని ఒక అపవాదు ఉంది. అది వాస్తవం కాదు. పూర్వ కవులు వ్రాసిన చాటువులు, వేమన్న పద్యాలు ఏ పత్రిక కోసం వ్రాశారు? మినీ కవితలు తెలుగు కవితా ప్రక్రియాల్లో కొత్తగాలిలో, విప్లవ ఝుం ఝూమారుతంలా పరిధ లిల్లికొండల్ని సైతం పిండి చేయగల సత్తాలో బలివత్తర కవితా శక్తిగా వచ్చిన ప్రక్రియ ఇది.

మినీ కవితను గూర్చి వివరిస్తూ 'శ్రీ ఎల్లోరా'గారు ఇలా అంటారు. అసలు ఎంత చెప్పాడని కాదు. కావ్యాత్మధర్మం - ఏం చెప్పాడు? ఎలా చెప్పాడు? అన్నదే కావ్యాత్మ ధర్మం. అసలు భావ బలం, భాషాధికాకారం, సమాజావగాహన ఉంటేగాని నాలుగు పంక్తుల్లో బాంబుల్లా ప్రేలే మినీ కవితలు వ్రాయలేరు. తగలవలసిన చోట్లుసూటిగా, ధాటిగా తగలగల రామ బాణాల్లాంటివి మినీ కవితలు.

అసలు చెప్పాలంటే శ్రీనాథుడు నుంచి శ్రీ శ్రీ వరకు మినీ కవిత రసప్లావితంగా, సుమనోహరంగా, భావగర్భితంగా, రంగు రంగుల దుస్తులతో, సుగంధపు ముస్తాబుతో వస్తూనే ఉంది. అయితే ఈనాడు వాటికి ఎక్కడా లేని ప్రాచుర్యం, ప్రాధాన్యం ఏర్పడి

నవి. ఒకే కవిత ఒక్కొక్కరి అభిరుచిని బట్టి, అవగాహనను బట్టి, ఆశయాలను బట్టి ఒక్కొక్క విధంగా సాక్షాత్కరిస్తుంది.

కొన్ని 'మినీకవితలు' మీరు ఇప్పుడు రుచిచూడండి.

**సత్తా. ఎల్లోరా.**

"ఎండలో బండలు కొట్టేవాడికి
సమాజంలో వాడి తెలుసు
సమయం కలిసొస్తే
బండమారిన సమాజాన్ని
బ్రద్దలు కొట్టడం అతనికే తెలుసు"

**బాకీ బి. భారతి**

"ఆకలితో చస్తున్నా
ఆశలలో దహిస్తున్నా
బాబూ,
ఒక సపాతీ ఇవ్వండి
కాదు.
ఒక తుపాకీ ఇవ్వండి
తీర్చుకుంటాను
నా తరతరాల బాకీ".

**విప్లవం : సి. వి. ఎన్. శోభన్‌బాబు**

ఈ మనుషుల కంటే
అగ్గిపుల్ల నయం,
నేల రాయాలని చూస్తే
భగ్గున ప్రజ్వలిస్తాయి.

**ఇదీ సంగతి, రమణ**

నా దేశంలో
పాముల్ని పూజిస్తారు
మేకల్ని మాత్రం బలిచేస్తారు.

**కాగితంపులి. ఎల్లోరా.**

కాగితం పులులు
కరవడంచేత కాక
అరుస్తాయి
నీటి చుక్కలు మీద పడితేచాలు
తడిసి ఒడిసితోక ముడుస్తాయి"

**అప్పు, రత్నశ్రీ యస్. (రాజశేఖర్)**

"అప్పుచేసి చనిపోయినోళ్ళు ధన్యులు
తీర్చేవాళ్ళు జీవన సంగ్రామంలో అభిమన్యులు
సంపన్నులకు పన్నుల బెడద"

—(ఆంధ్రజ్యోతి సౌజన్యంతో)

**బెడద, రత్నశ్రీ**

సంపన్నులకు పన్నుల బెడద
ఆ పన్నులకు, సంపన్నుల బెడద.

—(ఆంధ్రజ్యోతి సౌజన్యంతో)

పై కవితల్ని పరిశీలిస్తే పదాల పొదుపు, మాటల మెరుపు, మధురభావాల కూర్పు, సున్నితంగాను, సుమనోహరంగావ్యక్తీకరించడం పఠితల్ని ఆకర్షించి, ఆలోచింప చేస్తాయి. ఈ మధ్య యువకవులు వ్రాసే కవితల్లో కొంత అస్పష్టత, అన్వయ సంక్లిష్టత. అర్థంకాని అలంకారాలు, అర్థంచేసుకోలేని ప్రతీకలు(Symbols) కొంత మందికి నిరుత్సాహాన్ని కవిత్వమంటే చిరాకును కల్గిస్తున్నాయి. ఇవే లోపాలు కొంత 'మినీ కవిత'లు వ్రాసే వారిలో ఉండొచ్చు. కానీ, మనం మాత్రం ఏభావాన్ని ఎంత చక్కగా చెప్పాడన్నదే పరిశీలించాలి అతని కృషిని ప్రశంసించాలి.

పూర్వం కవిత్వం వందల కొద్దీ పద్యాల్లో ఉంటే, నేటి కవిత రస స్పందనాన్ని అందిస్తూ. సామాజిక విప్లవాన్ని తెల్పిస్తూ, చిన్న చిన్న పదాల్లో కొండంత భావాన్ని అందిస్తూ, భావచైతన్యాన్ని కల్గిస్తున్నాయి, ఈ మినీకవితల్లో ఆవేదన, ఆలోచన. వివిధ సమస్యలకు పరిష్కారం చూపడం. సమాజాన్ని ప్రతిబింబిచడం, అయోమయత్వాన్ని, అరాజకత్వాన్ని, నిరంకుశత్వాన్ని, పరపీడనా ప్రవృత్తిని విమర్శించి, మంచి సదవగాహనను కల్గించి, అపూర్వమైన ఆనందాన్ని, ఆలోచనను కల్గిస్తూన్నాయి. వీటిని ఇంకా ప్రోత్సహించవల్సిన అవసరం ఎంతో ఉంది

# ప్రజాసాహిత్య వైతాళికుడు- పాలకురికి సోమన

—డా॥ అయ్యగారి నరసింహమూర్తి

శ్రీశైల, శ్రీకాళహస్తీశ్వర, ద్రాక్షారామములను మూడు శైవ క్షేత్రములకు నడుమ నుండిననాడు తెలుగునాడు. క్రీ.శ. 7వ శతాబ్ది నుండి 12వ శతాబ్ది వఱకు తెలుగునేల నేలిన పాలకు లెల్లరు పరమ మహేశ్వరులగుట చెప్పుకోదగిన విశేషము. తెలుగులచదువు 'ఓం నమశ్శివాయ' అను షడక్షరీ శివమంత్రముతో నారంభమగుచు నీ భాష శైవమంత్రాత్మకమై తనరుచున్నది.

తెలుగుల ఆటతోటలో తొలుదొల్త తెలుగుల కొఱకు సామాన్య జనావళికి కొంగు బంగారము వలె నున్న దేశిచ్ఛందమగు ద్విపదలో మనఃప్రియముగా గళమెత్తి గానము చేసిన కవి బహు భాషా వేత్త, వీరశైవ మతప్రవర్తకుఁడు నగు పాలకురికి సోమనాథుడు.

ఈతడు స్వాతంత్ర్యప్రియుఁడు. సంకల్పబలమును బట్టి ఫలమునుబట్టి కార్యమునకు గుణాగుణములుండు నను విశ్వాసము గలవాడు. ఆ కారణముననే ఆంధ్ర సాహితీ కేదారముగ క్రొంగ్రొత్తరీతిలో వ్యవసాయము సాగించి సత్ఫలము నందిన కవి కృషీవలుఁ డీతడు. వస్తుగ్రహణ విషయమున. ఛందోవిషయమున, భాషా విషయములోను, తన ప్రతిభను వ్యక్తము చేసిన దిట్ట 'నిరంకుశాః కవయః' అను ఆర్యోక్తి యీతనియందు సర్వథా, సర్వదా సంపూర్ణముగా సార్థకమగుచున్నది. ఈతని మూర్తిని 2600 ప్రాంతముల నుండిన పిడుపర్తి సోమన ఈ గతిన వర్ణించినాడు.

శ్రీభసిత త్రిపుండ్రక పరీత విశంకట ఫాలుజాట జూటీ భరదారు నిర్గల పటీపటలా వృతదేహుఁవక్షమా లాషరణాఖిలాంగు బసవాక్షర పాదపవిత్ర వక్త్రిచి చ్ఛోషితచిత్తు పాల్కురికి సోమన దేశికుఁ బ్రస్తు
తించెదన్

లిపి లిఖింపకమున్నయ పరిమితార్థోక్తి
శక్తి యాతని జిహ్వ జరుగుచుండు
ఛందోఽధికరణాది సరణి చూడకమున్న
మదినుండు కావ్యనిర్మాణశక్తి
భాష్యసంతతులు చెప్పంగ చూడకమున్న
రుద్రభాష్య క్రియారూఢి వెలయు
తర్కశాస్త్రాది విద్యలు పఠింపకమున్న
పరపక్ష విగ్రహ ప్రౌఢి వెలయు

నతని నుతియింప నాబోటి కలవి యగునె?
జైన మస్తక విన్యస్తశాతశూల
కృతబిజ్జలతలగుండు గండబిరుద
శోభితుఁడు పాల్కురికి సోమనాధాభిదుండు.

ఈతని పాండిత్యము సర్వతోముఖము. ప్రతిభ అపూర్వము. అసమానము. ఈయన సంస్కృతాంధ్ర ద్రావిడ కర్ణాట. మహారాష్ట్ర మణిప్రవాళాది భాషలలో అనర్గళమైన వైదుష్యము గలిగినవాడు. కవితామర్మజ్ఞుఁడు. వీనికిఁ దోడు వివిధ మత సాంప్రదాయములు పలు ప్రాంతము లందలి సాంఘికాచారములు, సంస్కృతీ వైభవములు, లోకపు పోకడలు, బాగుగా

గు ర్తెఱింగినవాడు. పరమ నిష్ఠా గరిష్ఠుడైనను ఛాంద సుఁడు మాత్రము గాడు ఇన్ని గుణములు గలిగియు తదితర కవులకు వలె పండితుల ప్రాపకమునకుఁ గాని రాజాదరణమునకు గాని, కావ్య ప్రయోజనా లక్ష్యము నర్థయశములకుఁ గాని సుముఖుఁడు గాక నిస్స్వా ర్థముగ వీరశైవ మతప్రచారమునకే తన యావత్ శక్తిని ధారవోసిన కర్మిష్ఠి. ఇది ఈతనిలోఁ గల విశేషము. తానమ్మిన విషయములను త్రికరణశుద్ధిగ నాచరణ యందుంచెడి తత్త్వము గలవాడు. ఆడం బరమును, కుహనాతత్త్వమును ప్రదర్శించు గుణము మందునకైనను ఈతనియందు కానరాదు. అగ్నికి వాయువు తోడైన రీతిగ మతావేశము, ఈతని ఆవేశ స్వభావమునకు మరింత ప్రోత్సాహము నిచ్చి చేపట్టిన కార్యమును ఫలవంతము చేయ నున్ముఖుని చేసినది.

చిత్తమున శివుని నమ్మినవాడు సోమన. వీరశైవ మతోద్ధరణముతోఁ బాటు వర్గరహిత సమాజమును ప్రబోధించి అస్పృశ్యతను నిర్మూలించుట, దేశభాష, ప్రజాసాహిత్యాభివృద్ధులతోఁ బాటుగా సకలజన సులభ సాధ్యమైన భక్తి నాలంబనముగ ప్రజల నందఱను ఒకేచోటకు చేర్చి భోజన భాజనాదుల మూలమున జాత్యహంకార నిర్మూలన మొనర్చుటకు ప్రచారమొన రించుట ఈయనకు పరమ లక్ష్యములు తత్ఫలసిద్ధికై ఆయనెట్టి కార్యమును చేయుటకైనను వెనుదీయఁడు.

కళ్యాణనగరమున కధిపతియైన బిజ్జలుని ప్రధాని యగు బసవేశ్వరుని తరువాత తెలుగునాట వెలసిన వీర శైవ ప్రసక్తులలో సోమనాథుడు గణనీయుడు. పండితారాధ్య చరిత్రలో పలుచోట్ల 'బసవని గోత్రుడ, బసవని పుత్రుడ' నని భక్తిభావనల చెప్పినప్పటికిని, ఈతని తలిదండ్రులు శ్రియాదేవి విష్ణురామదేవులని. కట్టుకూరి పోతిదేవునికి భక్తుడని, చెన్నరాముడితని సఖుడని, వడిగామురామేశునకు శిష్యుడని ఈగ్రంథము వలననే తెలియబడుచున్నది. ఈతడు బ్రాహ్మణ వంశమున జనించినను ఉపనయన సంస్కారము నొల్లక శైవదీక్ష నందినాడు.

దేశీయ చరితల నుండి గ్రహించిన వ్యక్తుల చరి తములే ఈతనికి కథావస్తువు లైనప్పటికిని తనప్రతిభా సంపత్తిచే వీనికొక విశిష్టతను ఆపాదింప చేసినాడు. బసవేశ్వర, పండితారాధ్యులు కేవల ఈశ్వరభక్తులు కారని ప్రమథుల యవతారములని, మీదు మిక్కిలి శివునితో తుల్యమైన శక్తి సంపన్నతలు గలవారని చాటి చెప్పినాడు.

కవితకు భావావేశము జీవగఱ్ఱ కాగా భక్త్యావేశము నకు మూలకందము మతము. ఈ భక్త్యావేశము జను లకు అనతికాలములో వశ్యులనుగాఁ జేసికొని ఆవేశ పూరితుల నొనర్చును. గీతిమాధుర్యముగల రీతులలో గణనీయమై ప్రచారమునకు పరమసాధనమై వెలు గొందినది ద్విపద. ఈ ఛందమితనికి పూర్వము ప్రాకృతజనాదరణీయమేయైనను తనశక్తి యుక్తులచే తననాటసర్వజన సందోహముచే నామోదింపఁజేయ సమకట్టియందు సాహిత్యమును తీర్చిదిద్దిన ప్రథమా చార్యుడును ఈతడే. ద్విపదయందలి గానమాధురీ మహిమను గుర్తెరింగి భక్తితోడను నీఛందమున నొక ప్రత్యేకతను, పావనతను రూపింపదలఁచి యౌత్కృ ష్ట్యము నీరీతిగ విశదీకరించినాడు.

'ఐహికాముష్మిక ద్విపద హేతువగుట ద్విపదనాగ పరఁగా'- రెండు పాదములు గలిగినది ద్విపద.పాంచ భౌతిక శరీరమునుదాల్చిన మానవునకు ఇహపరములు రెండును కావలసినవి. ఆ రెండింటి సాధనకు సాధన మైనది ద్విపద గనుక యెల్లరకును అవశ్యముసంభావ నీయమని సోమనభావన.

మతప్రచార సాధనముచే జనోద్ధరణ మొనరించుట సోమన పరమాశయము గనుక ఈతని రచనలయంద నేక భక్తుల చరితలు చోటుచేసికొన్నవి. ఈభక్తు లందఱు సామాజిక వ్యక్తులై దేశచరిత్రలో ప్రసిద్ధి

పడినవారే. ఈభక్తిలోను ముగ్ధభక్తి, మోటుభక్తి మొదలగు భేదములెన్నియో గలవు కన్నప్ప, గొడగూచి, బెజ్జమహాదేవులభక్తి ముగ్ధభక్తి దీపకళియారు తనతలవెంట్రుకలతో శివునకు దీపమిడుట మోటభక్తి. ఈభక్తుల హృదయగీత భావములను వివిధ కోణములలో పరికించి ప్రత్యేక వ్యక్తిత్వముతో చైతన్యవంతముగ వ్యాఖ్యానించి సోమన కృతకృత్యుడైనాడు. సోమనకవిత ఆవేశపూరితమగు భక్తిరచన యగుట చేతనే ధూర్జటివంటి ప్రౌఢకవిని జవులొనరింపజేసినది. ఈరీతిని ఈతని కవిత అనంతర కవులనేకులకు మార్గదర్శకమై యలరారుట కిరవైనది.

సోమన కవితావేశమునకు భక్త్యావేశముతోడునీడగా నిలుచుటచే అతని కవితావాహిని నిరంతరాయముగ అమందముగ, ఉత్తుంగ శృంగమునుండి జాలవాఱు ఝరివలె విమలమై వడిగ్గ సాగినది. ఆహేతువుచే నీతడు వర్ణించు ప్రతివిషయము సవిస్తరముగ, నాపూర్ణముగ తనివితీరునట్లుండి వయోధర్మ భేదముగాని పండిత పామరభేదముగాని లేక సర్వులను ఆకర్షించి అలరారును.

శ్రీగిరిమల్లయ్యను భక్తులేగరివేడిస్తుతులు చెల్లించినది మనోహరముగా చెప్పినాడు.

నల్లహో! నల్లహో! నగరాజరాజ!
మల్లయా! మల్లయా! మహనీయతేజ!
పరమపాతకకోట్లు భస్మమైకూలు
శిరిగిరిమల్లయ్య శరణన్న చాలు
రాబోవనెంతదూరంబైన నిలువ
నేబోదుమల్లయ్య! నేటేటగొలువ !

భక్తి పారవశ్యమును గలిగించునది వేఱొకస్తుతి.

శ్రీగిరినాథాయ! శ్రితమన్మథాయ!
సోమాంకజూటాయ! శూలాయుధాయ!
భస్మీకృతా గాయ! పరమేశ్వరాయ!
తస్మైనమోస్తుకుధర వల్లభాయ!

ఈతనికి గలచేశిత పరిశీలనాదృష్టికి ఈ క్రింది పంక్తులే నిదర్శనములు.

తెల్లవారుఝామున కోళ్లుకూయుట సాధారణ విషయము. ఆతరుణమున ఆక్వకవాక వివిధావయవవిక్షేపముల వైఖరిని వర్ణించినతీరు చిత్రరులకును ప్రేరణనీయజాలినదై యున్నది.

తొలికూడి కనువిచ్చి నిలిచిమైవెంచి
జలజల తెక్కల సడలించి నీల్గి
గ్రక్కున కాలార్చి కంఠంబు లిచ్చి
ముక్కున నీకెలు చక్కొల్పి కడుపు
నిక్కించి యెడసాచి నిక్కిమ న్యూచి
కొక్కొక్కొకోకూయని కూయక మున్న-

ఈ చేష్టలందఱు నెరిగినవే యైనను అక్షరాకృతి నిదాల్చి నూతన పాఠకుల మానసములను ఆనంద జలధిలో తేలియాడుఁ జేయుచున్నవి.

సోమన కావ్యగీత పాత్రల బాహ్యాకారములను మిక్కిలి స్వభావ సిద్ధములను నట్లు తీర్చిదిద్దుటలో చతురుడు. పండితారాధ్య చరితమున శివుని చండాల వేషధారణమొక ఉదాహరణము మాత్రమే.

నీలి దొడ్డరు ద్రాక్షములు దొడ్డ పటికములు సూలమాని పూసల వేర్లు దాల్చి
కుఱు వెండ్రుకల వెడకొప్పులోపలను
కఱ కంద్రుగట్టిన కరిగాను పింప
బలువుగా శివ సూత్రముల పదగట్టి
మొలన రవణేదూటి తలనఁ జుట్టి
ఆరెయు కత్తియు నట్టలు మూడు
వారెనల్ ప్రోకులు వలచేత నొక్క
సెంబళికోలయుఁ జెన్నొంద శివుడు
పంబితయంత్యజ భావంబు దాల్చి"

2. వ ప్రకంబు

నిత్యలింగార్చనా విధిలో శివాభిషేకమయమున శిశు పోషణా విధానము వైద్య శాస్త్ర యోగ్యముగ చెప్పబడింది.

దొంగిళ్లపై నుండి లింగ మూర్తిలేని
అంగన గావించు అభ్యంగనములు
ముక్కొత్తు, చెక్కొత్తు ముక్కున్న పులుము
నక్కొత్తు, కడుపొత్తు నీటపీపు నిమురు
పెనుగంగ వలెనని తరుణి పీద్వడగ
చరణముల్ కరములు జాగంగ దిగుచు"

బెజ్జ మహాదేవి శివశరణురాలు. శివునకు తల్లిలేదని చింతించి ఆతనిని తనయునిగా స్వీకరించిన ధన్యురాలు. ఆ ఆడువారి మనోభావాలను ఎంత మనోజ్ఞంగా వర్ణించాడో ఈ క్రింది బసవ పురాణాంతర్గత విషయముల వలన విశదమగును.

తల్లిగల్గిన నేలఁదపసిగానిచ్చు
తల్లిగల్గిన నేల తలజడల్గట్టు
దల్లియున్న విషంబు త్రావనేలిచ్చు,
దల్లి యుండిన దోళ్ళు దాల్పనేలిచ్చు
దల్లి పాములనేల ధరియింప నిచ్చు
తల్లి బూడిదనేలదాఁబూయునిచ్చు
దల్లి పుచ్చునెభువి తనయునిదిరియ
తల్లి పుచ్చునె సుతువల్లకాటికిని
తల్లి లేకుండిన తనయుఁడుగాన
ప్రల్లదుడైయిన్ని చోట్లకు వచ్చె
జన్నిచ్చి పలుమాఱు వెన్నయు బెట్టి
పన్నుగా నిన్నియు బాలును పోసి
యాకొనుగాఁగడుపరసిపా లిచ్చి
సాకించి పెనుపఁ దేజనని గల్గినను
దానింత వాడయ్యె తల్లిలేకయును
దానెంత వెరుగునో తల్లి గల్గినను?

(బసవ 3-635-650)

పండితారధ్య చరిత్రమున

అట్లే సుందరను చెన్న జన్మ కథనమున శిశువు కావేరిలో పడగ వానిని మకర మీడ్చుకొని పోవునపుడు ఆ తల్లి తల్లడిల్లిన వర్గము పాఠకులను కంటతడి బెట్టింపకను మానదు.

ఒక మొసలీడ్వంగను విదనీక్షించి
యకట కేటాయంచు 'హా' యంచు గర్బ
మదచి కొంచును దేవుడా యంచునేల
బడి పొరలుచు సుతుల బనవుచు
వాలు విడిచి యేడ్చుచును కావేరిలో తాను
బడబోవుచును శోక పారవశ్యమునఁ
బొడిఁబొడిఁబొక్కుచుబొగులుచున్నంత
దొడరంగ పతియు బంధులు నేగుదెంచి
బంబరంబులుసేసి శైవోక్త వైదికంబుగా నాముష్మిక క్రియల్ సలుప
గనురెప్ప మాటైన గనలెదు తల్లి
దనయుండనిను బాసి తరియింపగలనె?
ప్రక్కబాసిన భయపడి యెడు తల్లి
ఇక్కడ నినుఁబాసియే నోర్వగలనే?
నేట్ట జమటయే నెత్తురన్ దాల్చి
బట్టినిన్ బాసియే బ్రతుకంగఁ గలనె?
యననేల? వేయు నాయన్న నేరంబు.
నినుబాసి నిలుపంగ నేర్తు నేయనుచు
నున్న పుత్రుని మన్కియున్కియు రూపు
సన్న పుత్రుడు నొక్క చందంబుగాన
నేరాలి సుతుమాటలెప్పుడాలించు
గూరిమి సుతుపలుకులు నప్పుతలఁచు
నేరాలిసుతునెపుడెత్తి ముద్దాడు
అరంగసుతుముద్దులాటదలంచు
నేరాలిసుతునెప్పుడీక్షించునపుడు
గారాబుసుతుని ఆకారంబుతలచు
మదితివైరియనంగ మరియాక్రమమున
నుడుగని పుత్రవియోగదుఃఖాగ్ని
వందుచు కందుచు వనరుచు నాత్మఁగుందుచు
దయ్యుచు గుయ్యుచుసుతు దలచి తలచి
ప్రలాపించియువిద
సంచలమతినిట్లు చరియింపనంత

(మహిమప్రకరణం - పండితా)

ఆలంకారికులు కావ్యదోషములను పదింటినిపేర్కొనగ నితడు ఇరువదియైదునకు పెంచుటయేగాక మరి కొన్ని మతభేదములనుగూడఁ గూర్చి కావ్యలక్షణము అందును స్వాతంత్ర్యము నవలంబించినాడు.

జల్లిపూరకమపశబ్దమక్రమము
వల్లవిక్రయజడ్డువోదవసంభ్ర
టనగాకు,వ్యర్థంబసంగతి,విరసంబు- వైకల్య
మత్యుక్తి వైరిపదమ్ముదల విరుపసమగ్రత
శిథిలబంధములుపబంధమ్ము
గ్రామ్యోక్తి కంఠకముద్రాస
ఛందోవిరుద్ధంబాదియగు"...

ఆలంకారికముగ నీతడెన్ని విషయముల లెఱిగినను కవితావేశము భక్త్యుద్రేకయుతము, గాన యోగ్యము నగుటచే వర్ణనీయ విషయమును తనివితీర వర్ణింపక విడుచుటకు వలనుపడక ఆయాతావుల కావ్యౌచిత్యము లోటువాటిల్లినను సోమన సరకుసేయ నిచ్చగింపలేదు. ఇట్టి ఆవేశము, ఒడలు తెలియని తనము మనకు భాగవతకర్త పోతనయందును కనవచ్చును అటులనే సోమన వర్ణనలు ప్రబంధవర్ణనలకు దీటుగానుండి కథాగీతికి నాటంకము కలిగించుచుండును అయినను ఆది మత ప్రచారమునకు అనుకూలమగుటచే తన లక్ష్యమును సిద్ధింతచేసి కొని తరించుటకు సంసిద్ధుడైనాడు.

వీరశైవములో ప్రత్యేకించి చెప్పుకొనదగినవికొన్ని గుణములున్నవి. అందుభక్తులకు జాతిభేదము లేదు. లింగభేదములేదు. ఎల్లరును సమానులే. కలిమిలేముల పట్టింపులుగాని, కులగోత్రముల ప్రమేయంగాని అవసిరములేదు. చదువు సంధ్యలతో నిమిత్తములేదు. కాని శివభక్తుడై యుండాలి. సంఘములోనుండే తారతమ్యాలను ఉన్మూలించి సమానత్వాన్ని ప్రతిపాదించడమే ఆమత లక్ష్యము వైశిష్ట్యము.

సోమనకు తత్త్వవిద్యా కళాప, కవితాసార, అన్యవాదకోలాహల, ప్రత్యక్షభృంగీశావతార, జైనమస్తకవిన్యస్త శాతశూల కవితకజ్జల తలగుండుగండ బిరుద శోభితయను బిరుదములుగలవు.

ఈతనికి పూర్వుడగు నన్నెచోడుడు శైవుడే యైనను, ఆతనికి మతదృష్టికంటె కావ్యకళాదృష్టిపై మక్కువ ఎక్కువ. కాగా సోమన మతముపై గల చూపు కావ్యకళావిషయమున నున్నట్లు కనిపించదు. పామరులకును మతముతో పరిచయము గలుగవలయు ననుతలఁపు ఒక ప్రత్యేక శైలిని గైకొనవలయునని గుర్తెఱింగిన వాడు సోమన. అదియేద్విపద. క్రొత్త యొకవింతయేయైనను ప్రాతయంతయు రోతకాదని గ్రహించినవాడగుటచే ఈతడు ద్విపదలందను ప్రాసయతిని వాడినాడు. తనకవితను ప్రజాపరము చేసినాడు

నన్నెచోడ, నాచన సోములవలె పాల్కురికి సోమనయు సకల కళాపారంగతుడు సర్వజ్ఞుడు. అనుటకు ఈతని కృతులు బహుముఖముల ఉపకరించును.

పండితారాధ్య చరితమున గురుభక్తాంధరికథతో మిండభక్తుల శృంగారము పెండదరులలరునట్లు వర్ణించినాడు ఇందాతనికిగల కామశాస్త్రవిద్యా కౌశలము వ్యక్తమగును. అటులనే ఆయావృత్తులను, విద్యలను నెఱింగించుతావుల నాతఁడు ప్రయోగించు పదములు ఆయాపారిభాషిక నిఘంటునిర్మాణములకుపకరించును. తెలుగునేలతో తయారైన సన్నని వలిపెములు ప్రపంచవ్యాప్తమై ప్రసిద్ధినందినవి. కాకతీయులనాటి వస్త్రనామ విశేషములనేకములను సోమన రచనలో చూడవచ్చును.

వెంజావళియు, జయరంజియు మంచు
పుంజులు, కుణిపట్టు, భూతిలకంబు
శ్రీ వన్నియము, మహాచీని జీనియును
భావ తిలకంబు, పచ్చని పట్టు....

క్షీరోదకంబు పట్టును, రత్నంపుపట్టును, సంకు
పట్టును, మరకత పట్టు, పొంబట్టు
నెరపట్టు, నెలిపట్టు, నేత్రంబు పట్టు... "

ఇట్టి వివరణములు అనంతర కవులలో నటనట కనబడును.

సోమనచు చోర, వైద్య, సంగీత, రసవాదాది విద్యలందును చక్కని ప్రవేశము గలదనుటకు ఆతని కృతులే సాక్ష్యములు.

జాతీయతయే తన కవితకు కంఠబలమని యెంచి తన రచనల యందు ఆయాతావుల నుచితముగ చక్కని లోకోక్తులను పలుకుబడులను వాడినాడు.

తను భక్తిపారవశ్యం
బున మరువక శాశివైక్యమున గల్గునె యెం
దును"మమ మాతా వంధ్య
యను బాసలు పొసగునె మహానందాత్మా

(అనుభవ సారము 172)

వంటని దుర్వ్యసనంబులు
పెంటకు గాకాఖ భక్తి పెంపునకుంగా
కుంటఁ జెడు భక్తుడాసల
రెంటిని నెడతాకి చెడ్డ రేవని భంగిళ్

(అనుభసారం, 114)

తెలుగు భాషా సౌందర్యమునకు పదములనా మ్రేడించి పలుకుట యొకసాధనము. అద్దానిని సోమన చక్కగా వినియోగించుకొనినాడు.

బసవ స్వామిగాగ వచ్చునే పేఱ పేఱ వారల
-కెల్ల
అరుగగ్గరాచి-కథకు కథకు నవ్వుచును-
గడియగడియ దప్పక-వారము వారము

ఆటులనే జంట పదములను. ఊత పదములకు వాడి కనిత కందచందములనుకై సేసినాడు.

ఆలింగమూర్తి నెయ్యంబు...ప్రీతిని నీతియు,
పెంపును సొంపు। నేపును నోపును నెలమియుఁ
గలిమి।

ప్రాపును దీపును రూపురేఖయును...
కట్టిగిట్టి-కట్నంబు, నోములు గీములు బాసలు,
గీసలు....

ఇక జాతీయములకు లెక్క లేదు. అచ్చ తెలుగు మాటలలో నీత డుపయోగించి నన్నిటిని మఱియే తెలుగు కవియు నుపయోగింపలేదు. కాని యవి యన్నియు నిఘంటువులందు చోటు చేసికొనలేదు.

అనుమానమను శబ్దమును "సందేహము"ను అర్థములో సోమన వాడినాడు. ఈ యర్థము సంస్కృతములో లేదు.

ప్రథమాంధ్ర కావ్యముగ పేరెన్నిక గన్న నన్నయ ఆంధ్ర మహాభారతావతరణము ఈతని కాలము నాటికి అసంపూర్ణము. ప్రాచీన మహాకావ్య గణనా ప్రసంగవేళల తొలుదొల్త నెన్నదగిన నన్నెచోడుని కుమారసంభవకావ్యమున జానుతెనుఁగు స్మరణ మున్నను అది మార్గమార్గముననేనడచి భావనాపుష్టికి భాషాపటిమకు ఇరవై పండితజనైకవేద్యమై అందల మెక్కి సామాన్య జనావళికి అందనిమ్రాని పండై అల రాలినది ఇకపాలు వూరిమల్లనగణితము శాస్త్రము. ఆటుమల్లికార్జున పండితుని శివతత్త్వసారము స్వతంత్ర మైనప్పటికిని గీర్వాణపదభూయిష్టమై యొప్పినది. ఈ గీతిని సాగిన తెలుగు మాగాణపుసాహితీ క్షేత్రమున క్రొత్తపుంతలు త్రొక్కుటకు దారవ జూపిన స్వతంత్ర రీతిలో చారిత్రక పురుషుల జీవితములను కావ్యవస్తువులుగా స్వీకరించి సాహితీ వనసీమలో వన్నె-వాసి తరుగని ధ్రువస్థానమును కల్పించిన సోమన నవగుణములలోన గణముతొలుదొల్త గణనీయమైనది. ఆంధ్రసారస్వతములో మొట్టమొదటి జీవితచరిత్ర బసవపురాణము.

శివతత్త్వసారమున పండితుడు రచించిన పద్యములను కొన్నింటిని సోమన అలవోకగా ద్విపదలలో పండితారాధ్య చరితముననిమిడ్చి తనకుగల శబ్దకౌశలమును వాక్యానుకరణనైపుణ్యమును చక్కగా ప్రదర్శించినాడు. ఈపండితారాధ్య చంద్రము-అందును పర్వతప్రకరణము ఒక విజ్ఞానసర్వస్వముగా నెన్నదగియున్న దన్నవారిపలుకు అర్థరహితముగాదు.

గుణసన్నిపాతమున పరమత దూషణమను దోషమపహరించినచో సోమన ద్విపద కవితకు సారస్వత గౌరవమును సంపాదించిన ప్రథమాచార్యుడని నిస్సంకోచముగ నుడువవచ్చును.

తెలుగుబాస యందలి గీతి రీతిని మతి నెంచినవాడు గావుననే తెలుగు పలుకులను తొలి పలుకులుగా గ్రహింపుడరి జనతను హెచ్చరించి జాతీయచ్ఛందసైన ద్విపదలో ప్రధాన గ్రంథములను తీర్చిదిద్దినాడు శిలయు సరియైన శిల్పి చేతఁబడినచో ఎదదకు వెంపును కనులకు నింపును గల రూపము రూపెత్తినటుల, భానూదయమున ప్రకృతి చైతన్యవంతమైనటుల ప్రతిభా సంపద గల సోమన గంటము నుండి జాలువారిన ద్విపద తన్మకళా గౌరవములను రెం(డి)ంటిని కైవసము చేసికొన్నది.

స్వత్వ సత్వప్రీతిచే నతని గంటము నుండి వెలువడిన నవీనగుణము లనేకములు. పద దుర్వీభర వారివేగమున కెనయగు సమాస ఘటిత పదప్రయోగము నందెంతటి అభినివేశము, ఆసక్తి గలదో జిలిబిలి పలుకుల కాకరమైన జాను తేనుగు నుడులను ప్రకరణోచితముగ ప్రయోగించుటలోను అంతటి అభిరుచి, ఆకాంక్ష గలిగినవాడు సోమన. జిలిబిలి పలుకుల వెలఁది తన ద్విపదములతో సోమన ముఖరంగమునందు బహుముఖములుగ నర్తించి కృతార్థత నందిన దనుట స్వభావోక్తియే యగును. భావానుగుణమగు పదప్రయోగ నైపుణిలో దషత గల్గ వాడగుట చేతనే ఈతని ద్విపద గ్రంథములలో అక్కడ ఇక్కడ అని గాక ఎక్కడ చూచినను నవరసములు చిప్పిలినట్లు ఆయాఘట్టములను తీర్చిదిద్దినాడు. తిక్కన దేశకవితామార్మికతకు పెట్టని గోడగా నెగడినది సోమన దేశీయతా ఒరవడియే.

సోమన వైదికేతర మతాభిమాని యైనను, ఆదిలో రచనారీతిలో ఆదికవి నన్నయ రీతి ననుసరించు నభిలాష గలవాడై యుండియు క్రమముగ రగడగా మొదలగు దేశీయ రీతులను గ్రహించి తుదకు ద్విపద వాహిణిలో తన కవితాఝరిని సంగమింపఁజేసినాడు. శ్రీ ఆరుద్ర తన సమగ్రాంధ్ర సాహిత్య చరిత్ర ద్వితీయభాగమున సోమన తొలిగ్రంథమగు అనుభవ సారమును గురించి చెప్పుచు నీ విధముగ వ్రాసిరి.

'తన తొలి రచనలో సోమనాధుడు ఇన్నిరకాల ఛందస్సుల్లో కవిత్వం చెప్పాడు గాని పోనుపోను ఈ ఛందస్సులు ఇంత అదృష్టం మళ్ళీ నోచుకోలేదు.

సోమనాథుడు వీటినన్నిటిని వదిలిపెట్టి చివరకు ఒకే ఒక ఛందస్సునకు జీవితాన్ని అంకితం చేశాడు. అదిద్విపద అని ముందే చెప్పుకున్నాం. ఈరెండు వందల నలువది ముంజపద్యాలలో ద్విపదలు లేవుగాని ద్విపదకు పూర్వరూపమైన తరువాజలు రెండున్నాయి. చిత్రమేమిటంటే ఏద్విపదనైతే ఉత్తరోత్తర చేపట్టబోతున్నాడో ఆద్విపదకు పూర్వరూపమైన తరహాజ ఈ అనుభవసారంలోని ఆఖరుపద్యం. అందులోనే అతడు ద్విపదకు శ్రీకారంచుట్టాడు. అనేటట్టు చివర 'శ్రీ' తో అంతమయ్యే "మంగళమహాశ్రీ"లు వాడాడు ఆ తరువాత ఆతరుహాజలు వాడలేదు. అతని ప్రభావం ఉద్ధృతం అయినాక అనంతర తెలుగు కవులు వాడలేదు. ఈ అనుభవసారంలో సోమనాథుడు త్రిభంగి అనేఛందమునొకదానిని వాడాడు. ఇది అపురూపమైనది. ఇతని తరువాత దీనినెవరు వ్రాయలేదు. అందుచేత లాక్షణికులు దీనినే లక్ష్యం క్రింద స్వీకరిం

చారు శిల్పరహస్యాలను కరస్థలి విశ్వనాథయ్యగారు ఎన్ని సోమనాథునికి బోధించారో వానిని అతడు తొలి రచనలోనే అమలు పెట్టాడు. ఒకప్రక్క ఇలా సంవిధానంలో సిద్ధహస్తుడవుతూనే సోమనాథుడు చక్కని పదాలతో ఉత్తమ భావాలను చెప్పసాగాడు.

ఇందుమూరి అన్నయ ఓరుగల్లును పాలించిన ప్రతాపరుద్రుని మంత్రి. ఈయన సోమన అంతేవాసి పాల్కురికి సోమన ఓరుగల్లును మెట్టినవారపటిమచే ఖరయతాలను ఖండించే అందరినీ పాదాక్రాంతులను చేసికొన్నాడు. ఆసందర్భంలో సోమన పరమత ఖండనకు వీరశైవమత ప్రతిష్ఠాపనకు పండితుని పద్ధతియే శ్రేయోమార్గమని మనమున నెంచి ఆయన చరితనే కావ్యం వ్రాస్తే జనోపకరణమని భావించాడు. శ్రీశైలమండలి వీరమహేశ్వరాచార వర్తనులు సోమనను పండితుని చరితమును చెప్పమని అడిగినారట. తేటతెలుగులో ద్విపదతో చెప్పవలెనని సంకల్పముతో ఆయన చరితను 11, 810 ద్విపదలలో నయిదు ప్రకరణాలలో సర్వాంగసుందరంగా తీర్చిదిద్దినాడు. ఇందులో ననేక విషయాలు వివరింపబడినవి. సోమన తెలుగుజాతికిచ్చిన విజ్ఞాన సర్వస్వం ఇది.

నవీనగుణ సనాథుడని ఖాసిగాంచిన ఉత్తరహరి వంశకీర్తి నాచన సోమనకంటె ఒక వంద సంవత్సరములకుముందే పాల్కురికి సోమన నవీనగుణములను చెప్పినాడని సంగ్రహముగా అవి ఇరువదియైదు అని పండితారాధ్య చరిత్రకుపోద్ఘాతము వ్రాసిరి చిలుకూరి నారాయణరావుగారు చెప్పారు. వారందులో పట్టికల రూపములో అనేక విషయములను చక్కగా వివరించారు ఈతని రచనలు నాటితెలుగుస్వరూప స్వభావాలను గుర్తెఱుంగుటకు ఎంతగానో ఉపయోగకరముగ నుండును. భాషాశాస్త్రము పలుతెఱంగులుగ నభివృద్ధి నందుచున్న ఈ దినములలో సోమనను గురించి ఒక్కొక్క గ్రంథముపై పరిశోధించి సాధింపవలసిన విషయములెన్నియోగలవు ప్రత్యేకించి ఈతడు ప్రయోగించిన పదములకే నిఘంటువును తయారు చేయవలసిన అగత్యమెంతయోఉన్నది. బహుభాషావేత్తలు ఈతని రచనలపై ప్రత్యేక శ్రద్ధ చూపవలసి ఉన్నది. పదకోశనిర్మాణము ఆవశ్యకము.

పండితారాధ్య చరిత్రమున ఫలశ్రుతి ఈవిధముగ వ్రాయబడినది.

అర్థాధమత్రి మల్లికార్జునపండి<br>
తారాధ్య చరిత మాద్యంతంబు వినిన<br>
చదివినవ్రాసిన సంగ్రహించిన స-<br>
ముదితాభిఫలంబులు వొందుదురుదె?<br>
కావునసీకృతి గారవించినను<br>
వావిరిఁజదివినవ్రాసినవినిన<br>
నరుదొందవారలకభిమతార్థములు<br>
గరుణించు శివుడు మంగళ మహశ్రీలు" ....

ఆద్యంతము నిండుకూరిమితో ఓరిమితో జదివిన వ్యక్తులకనేక అభిమతార్థములొనఁగూడు ననుటలో ఆవంతయు నతిశయోక్తి యుండదు.

8 క్రాస్ రోడ్<br>
మాచవరమ్ డౌన్<br>
విజయవాడ-520004<br>
ఆం. ప్ర

ఆడంబరాలు, ఆత్మవంచనతా లేని నిరాడంబర కవి. What chameleon poet delights that shoess virtuous philosopher (కీట్సు) అన్నట్టు నిబద్ధులైన విమర్శకులకు బైరాగి నచ్చడు, బైరాగి గొప్పను వారు ఒప్పరు బైరాగి కవితామరజీవి, బుద్ధిజీవి, అతని కలం-బలమైంది. అతని ఆలోచన నిశితం. అతని కవిత్వం ఆలోచనామృతం

యు. శివలింగము
చల్లపల్లి, కృష్ణాజిల్లా
521 126

# 'తూర్పువాకిళ్లు – ఒక పరిశీలన'

ఆధునికాంధ్ర సాహిత్యాకాశంలో వినూత్న కాంతులు ప్రసరింప చేస్తున్న కవి నాగభైరవ కోటేశ్వరరావు ఆయన సుప్రసిద్ధ ఆధునిక కవితా కోటేశ్వరుడు, సమున్నత భావుకుడు ఉత్తమ సంస్కారి. ఆయన కవితలు ఈనాటి కవితా ధోరణులకు మార్గదర్శకాలు. తెలుగు సాహిత్యంలో ఆయన ఒక ప్రత్యేక స్థానాన్ని ఏర్పరచుకొన్నాడు. తనకంటు ఒక ప్రత్యేక స్థానం ఉందని, మరొకసారి తన కవితల ద్వారా నిరూపించుకొన్నాడు.

'తూర్పు వాకిళ్ళు' ఈయన మొదటి కవితా సంకలనం కాదు, ఇదివరకే ఎన్నో కవితల సంకలనంలు సృష్టించాడు. ఇంకను సృష్టిస్తారు.

ఈ కవితా సంకలనంలో యిరువది రెండు కవితలు కలవు ఒక్కొక్క కవితలో సమాజానికి చక్కని సందేశాలు అందించాడు,

కవిత్వం సంకేతనిబద్ధం, అందుకే ఆలోచనా మృతం అన్నారు. రసం దానికి ముఖ్యం. కవిత్వం చదివినపుడు ఆనందంతోపాటు అనుభూతి కలగాలి. అనుభూతి పొందాలి. కఠినమైన జీవితాన్ని కవితా వస్తువుగా చుట్టూ అలముకొన్న చీకటి ఎంతటి భయానక క్రూరంగావుందో సగటు మనిషి, పరిస్థితులను తట్టుకోలేక, ఎట్లా కొట్టా మిట్టాడుతున్నదో. నవనవోన్మేషంగా, చక్కని భాషలో. నలుగురికి అర్థమయ్యే విధానంలో, చిక్కని చిత్రాలతో వర్ణిస్తాడు. అంధకారమైన జగత్తును తీవ్రభాషలో విమర్శిస్తాడు.

'తూర్పు వాకిళ్లు' కవితా సంపుటికి అట్టమీద బొమ్మ చిత్రించినవారు కొండూరి సుబ్రహ్మణ్యంగారు. ఈ ముఖపత్రం పేరు సరియైన సమీక్ష, ఈ కవితా సంకలనం ముందర అట్టపై కొండలు, వాటి వెనుక ఎఱ్ఱటి సూర్యుడు పుట్టుతున్నట్లుగా చిత్రీకరించారు ఇరువైపుల ద్వారపాలకులుగా రెండు కలంలు ఎఱ్ఱటి సూర్యుడు. అభ్యుదయమునకు ప్రతీక, ప్రపంచానికి వాకిలి సూర్యుడు అతను రాకతో ప్రపంచమంతా వెలుతురులో స్నానమాడుతుంది. ప్రపంచానికి సూర్యుడు ఎంత అవసరమో, దిక్కులలో తూర్పు దిక్కుకి అంతస్థానం వుంది, తూర్పు దిక్కుకు ఎందరో నమస్కరిస్తారు, మరెందరు సూర్యుని రాకకోసం ఎదురుచూస్తారు ఈ కవితా సంపుటి నాదెండ్ల వెంకటేశ్వరరావు గారికి అంకితం యివ్వడంలో ఒకప్రత్యేకత గోచరిస్తుంది.

తూర్పుయొక్క గొప్పదనాన్ని. వాటి నిర్దిష్టతను కవి ఏవిధంగా మలచుకొన్నదీ.

తూర్పు నా ఉదయం
తూర్పు నా హృదయం

అని వివరిస్తాడు తూర్పే నా ఉదయం అంటాడు, తూర్పు నాహృదయమంటూ, తూర్పే నాప్రాణం అంటారు.

'రాత్రి' అన్న గేయంలో
ఈరోడ్లు
పగలంతా ఆదర్శాలు నటిస్తు
రాత్రులు కోరికలతో వ్యభిచరిస్తూ
అవినీతిని రవాణా చేస్తాయి
మానవత్వాన్ని దివాలాతీస్తాయి

అనిరోడ్లను వర్ణిస్తారు, రోడ్లు మనుషులకోసమే నిర్మించబడినాయి, మనుష్యుడు ఏలామారుతారో పరిస్థితికి ఏ అవతారం ఎత్తుతారో ఈ గేయంలో తెలుస్తుంది, మామూలు రోడ్లు కాదు అందమైనరోడ్లు, ఈరోడ్లులోనే రకరకాల మోసాలు జరుగుతున్నాయని కవి ఆందోళన చెందుతాడు, ఆవేదనకు లోనవుతాడు రోడ్లను మనుష్యులుగా పోల్చుట జరిగింది,

"జనపరి ఫస్టు
జాతివెలపసకి ఫస్టు"

అన్న గేయంలో 'జనవరిఫస్టు' ప్రపంచానికి పర్వదినం! జనవరిఫస్టు, నాడు రకరకాలపూలు, ఆపిల్ పండ్లతో ఒకరికొకరు సంతోషంగా ఇచ్చుకోవడం జరుగుతుంది, ఇదంతామోసమే అవి కని అంటారు.

ఓసి! నెల్లూరునగరమా!

అన్న గేయంలో నెల్లూరినగరాన్ని చక్కనిసుందరితో పోల్చాడు. నెల్లూరు నగరంలో వస్తువులన్నీ ఆసుందరికి అతికించాడు. అది మామూలు సుందరికాదె, త్రిలోకసుందరి ఆలాంటిసుందరి పెన్నానదిలో జలకాలాడి, కురులు ఆర్పు కొనువేళ నగ్నసుందరిగా కనిపించదట! నెల్లూరు నగరం యొక్క చరిత్రను, పెన్ననదియొక్క విశిష్ఠతను కవిచాలా చక్కని శైలిలో చెప్పినాడు.

ఆగర్భశ్రీమంతునికి, అనుభవం మీద జరిగిన పోరాటాన్ని వినతిస్తూ

"శ్రమజీవులు, చీమలు
తమకై నిర్మించుకొన్న పుట్టల్ని
ధనస్వాముల పాముల
దురాక్రమణచేసి
సామ్యవేదం చదువుతున్నపుడు"

అని ప్రస్థానం గేయంలో, పేదవానియొక్క కడుపులు గొట్టి ఏలా శ్రీమంతులు అయ్యారో, పేదవారిపై దౌర్జన్యం, అసూయ కనిపిస్తుంది: ఇలాంటి సమాజం వుండకూడదని కవి ఉద్దేశ్యం, నవసమాజంకోసం ఆరాటపడుతారు.

రేపటి బావుటాలు అన్నగేయంలో

నిరాశలో నిలిచిపోను
నిస్పృహానే నిలుపుకోను
అపజయాలు మెట్లుజేసి
ఆశయాలు సాధింతును

నిరాశలు నిలిచిపోవద్దు, నిస్పృహతో కలిసి పోవద్దు, అప జయాలను మెట్లుగా సాధకం చేసికొని ఆశయాలు సాధించు అని కవి ఉద్బోదిస్తాడు.

శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం. - 515 003

# అస్తిత్వవాదం-5

అస్తిత్వవాదాన్ని గురించి బాగా పరిశీలించిన తదువాత తేలుతున్న ముఖ్య విషయాలు.

అస్తిత్వము (Existence) సారము Essence).

ఇంతవరకు మత ప్రవక్తలూ, ధార్మిక సంప్రదాయాల వారూ వస్తువు అస్తిత్వంలోకి రాక పూర్వమే దానికొక ఆదర్శరూపం పరికల్పితమై వుంటుందన్నారు. అంటే మానవుని అస్తిత్వప్రాప్తికి పూర్వమే అతని జీవితానికొక ఆదర్శరూప ముంటుందని అర్థమవుతుంది. కాని ఈ సిద్ధాంతాన్ని అస్తిత్వవాదులు అంగీకరించరు. అస్తిత్వం (Existece) ముందుగానూ, సారము(Erss ence) తరువాతనూ వుంటుందని వారి సిద్ధాంతం. అస్తిత్వము సారము ఈ రెండింటి పరిభాషను గూడా మనం గుర్తుంచుకోవాలి. సారంఆకారయుక్తమైన ప్రయోజనాత్మకతత్వం. అస్తిత్వం చేతనాసంపన్నం. క్రియాశీలం. మానవుని అస్తిత్వం ప్రయోజనశీలమనీ, సార్థకమనీ, క్రమబద్ధమనీ అనేథాన్ని అస్తిత్వవాదులు అంగీకరించరు. మానవుడు అనేక బాధ్యతలతో అసహాయుడుగా, ఒంటరిగా ఈ లోకంలోకి విసరి వేయ బడుతున్నాడు. అతడికి ధ్యేయమనీ, నియతి అనీ ఏమీ లేదు ఏధ్యేయాన్ని అతడు నిర్ణయించు కుంటే అదే అతని ధ్యేయం. నియతి "సంఘర్షణ చేసి అతడు ఈ లోకంలో తనకు స్థానాన్ని కల్పించు కొంటున్నాడు. ఆ తరువాత తననుతాను వ్యాఖ్యానించుకొంటున్నాడు" అన్నాడుసార్త్రి. ఇదే విషయాన్ని ఇంకా స్పష్టంచేస్తూ ప్రారంభంలో మనుష్యుడు "ఏదీ" కాడు, తరువాత అత "డొకడు" అవుతున్నాడు; అంటే అతడు తనను తాను నిర్మించుకొంటున్నాడని గూడా అన్నాడు. ఈవిషయాన్ని సార్త్రి తన ఆత్మకథలో విపులంగా వివరించాడు. మీ పాత్రలు శీఘ్ర నిర్ణయం తీసుకొంటవి, ఎప్పుడూ క్రైసిస్‌లో వుంటవి,కారణ మేమిటని సార్త్రిను ఎవరో ప్రశ్నించారు దానికి సమాధానంగా "నా పాత్రలు నాకు ప్రతిరూపాలు, నేను అంటే "ఇప్పుడున్న నేను" కాదు, నేను "ఏది కాదలచుకున్నానో ఆ నేను" అన్నాడు. అంటే అస్తిత్వవాది కావడం వేరు, అస్తిత్వవంతుడు కావడం వేరు అని స్పష్టమవుతుంది ప్రతి జడవస్తువూ "ఉంటుంది." కాని అది అంతమాత్రంచేత అస్తిత్వం కలదికాదు. అస్తిత్వవంతుడు ఒక్క మనుష్యుడే

అతడు ఏది కావలనుకుంటే అది కాగలుగుతాడు. ఆ శక్తి జడ పదార్థాలకు లేదు. అయితే అందరూ అలా కాగలుగుతున్నారా? అని గూడా ఒక ప్రశ్నవున్నది. అస్తిత్వవాదులు గొర్రెదాటు వ్యవహారాన్ని అంగీకరించరు.

## అస్తిత్వవాద దర్శనము

వైయక్తికమైన అస్తిత్వం నుండే దర్శనముత్పన్నమవుతున్నదని అస్తిత్వవాదులు విశ్వసిస్తారు. సమస్తభౌతిక విజ్ఞానాన్ని గూడా వారు ఉపయోగించుకొంటారు. దాన్ని అతిక్రమించి "లోపలి" రూపాన్ని దర్శించడమే దర్శనమంటాడు జాస్పర్స్. మనుష్యుడు తాను ఏది కావలచుకొన్నాడో దాన్ని సాధించే ప్రయత్నం ప్రారంభిస్తాడు. దానితోనే దర్శనం ఆరంభమవుతుంది. మానవుడు తనను తాను పొందే ప్రయత్నంచేస్తాడు. తాను పొందిన దానిని ఇతరులకు గూడా అందిస్తాడు.

అందుకతడు రెండు రకాలైన చింతనా పద్ధతుల్ని అనుసరించ వలసి వుంటుంది. ఒకటి వస్తుగత చింతనా పద్ధతి రెండోది ఆత్మగత చింతనాపద్ధతి. వస్తుగతపద్ధతిలో వస్తుగత సత్యజ్ఞాన ప్రాప్తివుటుంది అప్రాప్తికి బౌద్ధిక విధానం సహాయం చేస్తుంది. ఈ పద్ధతిలో పూర్వధారణలకు ప్రాముఖ్య ముంటుంది. ఆత్మగతచింతనా పద్ధతి లక్ష్యం ఆత్మ గత సత్యజ్ఞాన ప్రాప్తి. ఈపద్ధతిలో సహజానుభూతికి ప్రాధాన్యముంటుంది. దీనిలో పూర్వధారణలకు తావుండదు. ఈరెండు పద్ధతులేగాక ఇంద్రియవిషయాత్మక పద్ధతిఅనిఇంకొకటున్నది ఆపద్ధతిని హుసరెల్, హెడ్‌గర్‌లు ప్రతిపాదించారు. ఇంద్రియ గోచరమైన వాటిచి మాత్రమే ఈ పద్ధతి లో వివరించడం జరుగుతుంది. ఇది ఆత్మగత చింతనా పద్ధతి యొక్క సూక్ష్మరూపమనీ. దీనిని ప్రత్యేక పద్ధతి అనవలసిన అవసరంలేదనీ చాలామంది అభిప్రాయం.

## అసలు అస్తిత్వానికి హేతువేమిటి ?

అస్తిత్వవాద సిద్ధాంతం ప్రకారంవ్యక్తి తనఅస్తిత్వానికి కారణంగాదు. అంటే 'అతడు తానుగా తన అస్తిత్వాన్ని సృష్టించుకొనడంలేదు. అది బాహ్యావస్తువుల విషయంలోనూ సత్యమే, చేతనామయమైన అస్తిత్వం విషయంలోనూ సత్యమే ''మనుష్యుణ్ణి ఈ విశ్వంలోకి విసరివేయడం జరిగింది? అది ఎందుకు జరిగింది. అని ప్రశ్నిస్తే దానికి జవాబులేదు'' అన్నాడు హెడ్‌గర్. ఈ విశ్వనిర్మాణం వెనక ఏమీ కారణం కనబడడంలేదు. దీనికి ఒక ప్రయోజనంగానీ, ఒక ఉద్దేశ్యం గానీ, ఒక అవసరంగానీ, ఏమీ కనబడటం లేదు. ఈ నిరర్థకమైన ప్రపంచంలోనికి మనుష్యుడు తనకు తానుగా రావడంలేదు. ఇదంతా ఆతనికొక అశ్చర్యకరమైన ఘటనగా కనబడుతున్నదంటాడు. సార్త్రె. ఏమిటి ఈ సృష్టి? ఎందుకు మానవుడు జన్మిస్తున్నాడు? ఏ ప్రయోజనాన్ని సాధించడానికి అతడిక్కడికి వచ్చాడు? అతడి జన్మకు పరమ ప్రయోజన మేమిటి? అని ప్రశ్నిస్తే జవాబులేదు. ప్రయోజనంగానీ, హేతువుగానీ, అసలు అవసరంగానీ ఏమీలేవు. తేలిన సారాంశమిది.

## అలౌకిక శక్తి – మానవుడు

మధ్యయుగంలో నిఖిల సృష్టికీ ఏదో మానవాతీతమైన అలౌకిక శక్తి కారణమనీ, ఆ శక్తి అద్భుతమైనదనీ, అవాఙ్మానస గోచరమైనదనీ భావించబడింది, ఆ శక్తితో తాదాత్మ్యాన్ని సాధించడమే మానవ జీవిత లక్ష్యమనీ, సార్థకతఅనీ ఉపదేశించబడింది. ఈ సృష్టి అంతా మాయారూపంలోనో, లీలా రూపంలోనో ఆశక్తి చేసిన సృష్టియే అని బోధింపబడింది. ఆధునిక యుగంలోకి ప్రవేశించిన కొద్దీ ఆ అలౌకిక శక్తి విలువ రోజు రోజుకూ తగ్గిపోతున్నది అంటే మానవతా గరిమ, విలువ పెరుగుతున్నదని అనుకోవచ్చును. ఆ గరిమను పెంచడం అస్తిత్వవాదం ప్రబోధించే పరమసత్యం. అస్తిత్వవాదం అలౌకిక శక్తిని వదలి మానవుణ్ణి గురించీ, అతని అస్తిత్వాన్ని గురించీ ఆలోచిస్తుంది. ఈశ్వరవాదులైన అస్తిత్వవాదులుమానవుడు ఈశ్వరుని సమక్షంలో నిర్ణయాలు చేస్తాడంటున్నారు. నిరీశ్వర వాదులు మానవుడు తన ప్రయత్నం. సంఘర్షణ వంటి వాటిమీదనే ఆధారపడతాడంటున్నారు, అయితేఇద్దరూ నిర్ణయాలు మానవునివే అంటున్నారు. ఇద్దరూతన అస్తిత్వానికి అర్థం కల్పించే ప్రయత్నాన్ని మానవుడే చేస్తున్నాడని అంగీకరిస్తారు అంతతోగత్వా ఇద్దరూ చెప్పుతున్న దానికి సారాంశం ఒక్కటే. కాని చెప్పే పద్ధతిలో మాత్రమే కొద్ది తేడా కనబడుతున్నది. కామూ ఒక చోట మానవుడు చివరిచివరికి దేవుణ్ణీ, అన్యాయం చేసే వాణ్ణి ఇద్దర్నీ తొలగించి వేస్తాడన్నాడు. అస్తిత్వవాద రచయితలు తమరచనల ద్వారా ప్రతి వ్యక్తి తనను తాను గుర్తించుకొనేటట్లు చేయవలసివున్నదనీ, తన అస్తిత్వం తాలూకు సంపూర్ణమైన బాధ్యతను వహించేటట్లు చేయవలెననీ సార్త్రె ఉద్బోధించాడు.

## మానవ శరీరము చైతన్యము

మానవ శరీరం మానవుని అస్తిత్వానికి చాలా అవసరం. అదిలేనిది ఏమీ లేదు. చైతన్య స్ఫూర్తికి గూడా అది అవసరమే. సార్త్రె చైతన్యాన్ని గుర్తిస్తూ ఇతర జగత్తు కంటే మానవుడు చైతన్యం కారణంగానే వేరుగా కనబడుతున్నాడనీ, చైతన్యం కారణంగానే "సంకల్పించ" కలుగుతున్నాడనీ అన్నాడు. మానవేతర పదార్థాలన్నీ జడ పదార్థాల కిందనే లెఖ్ఖ. మానవుడు అట్లాకాదు. అటువంటి మానవుడు 'ఈ జగత్తులో నిస్సహాయుడుగా జీవిస్తున్నాడు. ఆ విధంగా అతనికి జీవించక తప్పడంలేదు. ఇదొక శాపంగా అతనికి తయారయింది' అని గూడా సార్త్రె అన్నాడు.

వైజ్ఞానిక దృష్టితో చూచినప్పుడు భౌతిక తత్వమంతా ఒక్కటే అయినా ఈ జగత్తు అందరికీ ఒక్కటిగా కనబడడంలేదు. వ్యక్తిని బట్టీ, సమయాన్ని బట్టీ గూడా దృష్టి మారుతున్నది. దానికి రుచిభిన్నత కారణమవుతున్నది ఇది గూడా ఆలోచించవలసిన విషయం ఆకారణంగా మానవ సంబంధాలలో స్నేహము, ప్రేమ, విద్వేషము వంటివి పెరుగుతున్నవి రకరకాలుగా విభేదాలు విద్వేషాలు వృద్ధి చెందుతున్నవి. యేమైనా జగత్తుమీద మనం ఆధారపడము, మనమీదే జగత్తుఆధారపడాలి. అంటారు అస్తిత్వ వాదులు'

మనుష్యుడు పూర్ణ స్వతంత్రుడు. జన్మించినదాది అతడు తన అస్తిత్వానికి ఒక అర్థాన్ని కల్పించుకొనే ప్రయత్నం చేస్తున్నాడు. తన లక్ష్యాన్ని. తన ధ్యేయాన్ని తను ఎన్నుకొంటున్నాడు ఎన్నుకోవాలి. అది లేనినాడు అతడు కట్టుబానిస అవుతాడు. స్వేచ్ఛ అతనికి అవసరం అది చాలా ముఖ్యం అంటూ సార్త్రె స్వేచ్ఛను మూడు రకాలుగా వివరించాడు.

(1) వైయక్తికంగా మనుష్యుడు తన భవిష్యత్తును తానే సృష్టించుకొంటాడు. అది ఒక రకపు స్వేచ్ఛ.

(2) ఆయినా అతడు సంఘంలో వుంటాడు. అందువలన తన తోటి వ్యక్తుల్ని విస్మరించలేడు. విస్మరించ గూడదు. సామాజిక బంధనాలు పూర్తిగా విస్మరించబడవు దాని వలన అతని స్వేచ్ఛ కొంత తగ్గుతుంది అయినా ఇంకొక మార్గం లేదు. తోటి వ్యక్తులతో కలిగిన యేర్పడిన సంబంధాలను బట్టి ప్రేమ, ద్వేషము వంటివి యేర్పడడం వాటి తాలూకు ప్రభావం అతని మీద పడడంగూడా కొంత వరకు స్వాభావికమే, యేది తనకు మంచిదిగాదో అది ఇతరులకు కూడా మంచిదిగాదని అతడు భావించవలసి వస్తుంది. అస్థితిలో కొంత సంఘర్షణ లాంటిది యేర్పడడం సంభవం.

(3) పరిస్థితుల ప్రభావాన్ని గూడా మానవుడు స్వీకరించవలసి వస్తున్నది కురూపిగానీ లేక రూపవంతుడుగాగానీ బీదవాడు లేక ధనవంతుడుగాగానీ జన్మించడం వంటివి అతని చేతిలో లేవు అంటే భౌతిక జగత్తు నిర్మాణం పూర్తిగా అతని చేతిలో లేదు కాని వాటిని గురించి అతడు కొన్ని భావాలను యేర్పర్చుకొంటున్నాడు. ఇవన్నీ స్వేచ్ఛా మార్గంలో యేర్పడుతున్న అవరోధాలే.

ఒకానొక దుర్ఘటన వల్ల వ్యక్తికి వికలాంగత్వం యేర్పడుతున్నది. అది పరిస్థితివలన కలిగిందే కాని దానిని స్వీకరించడంలో వ్యక్తికి స్వేచ్ఛ ఉన్నది. వికలాంగుడు, లేక అంతకంటే వికట పరిస్థితిలో పడినవాడు ఆత్మహత్య చేసుకొనవచ్చును, లేక సంకల్పబలంతో అటువంటి పనిచేయక పూర్తిబాధ్యతతో జీవితపథంలో ముందుకూ సాగవచ్చును. జీవితంలో అవన్నీ సంభవాలే. అస్తిత్వవాదం ముందుకు సాగడాన్ని ప్రోత్సాహిస్తుంది.

స్వేచ్ఛకు అర్థం ఉచ్ఛృంఖలత్వం కాదు. మనుష్యుడు బాధ్యత గలిగిన, బాధ్యత తెలిసిన వాడు. తానుచేసే పనుల బాధ్యత తన మీదనే వుంటుందని అతడు గ్రహించినవాడు. యుద్ధం సంభవించినా ఆ బాధ్యత గూడా అతనిదే. పరిస్థితుల చాటునదాగి తన బాధ్యతను విస్మరించినవాణ్ణి కాముా పిరికిపంద అంటాడు. సార్త్రె చిత్రణ ప్రకారం ప్రతి మనుష్యుడూ సర్వశక్తిమంతుడు కావాలి.

### జీవితపు విలువలు

మానవ జీవిత గమనాన్ని నిర్ధారణ చేసే ఆదర్శాలను, తత్వాలను జీవితపు విలువలంటాము. జీవితపు విలువల విషయంలో అస్తిత్వ వాదులలో ఈశ్వర వాదులు, అనీశ్వర వాదుల్లో కొద్ది అభిప్రాయ భేదాలున్నవి. నిట్చే ఈశ్వరుడుచచ్చాడని సిద్ధాంతం యేర్పర్చాడు. తప్పుడు విలువల్ని మోసేవ్యక్తిని నిట్చే బరువు ఎక్కువ కావడంవల్ల నడవలేక వాళ్ళమీద కూలబడిన ఒంటెతో పోల్చాడు. జీవితపు విలువల్ని మానవుడే నిర్ధారించుకొంటాడు. విలువలు నిర్మించే వాడతడేనని అభిప్రాయ

పడ్డాడు. సార్త్ర్ గూడా కొంతవరకు నిట్చే అభిప్రాయంతో యేకీభవిస్తున్నాడు. మానవ నిరపేక్షమైన విలువలకు విలువ లేదంటాడు సార్త్ర్. కళాకారుడు యుగద్రష్టకావలెననీ, తన రచనల్లో కొత్త విలువల్ని సృష్టించవలెవనీ అంటాడు. విలువలనేవి ఆయాయుగాలలోని వ్యవస్థకు ప్రతిబింబంగా వుంటవి. కొద్ది రోజులకు ఆ విలువల విషయంలో జన సామాన్యంలో మూఢ నమ్మకం, మోహం యేర్పడుతుంది. అది మంచిదిగాదు. పరిస్థితుల వలన, యుగాల అవసరాన్ని బట్టి విలువలు ఏర్పడాలి. కళాకారుడు రచయిత కేవలం వర్తమానంతోనే సంతృప్తి పడక ముందును గురించి ఆలోచిస్తాడు అంటాడు సార్త్ర్. జీవితపు విలువలు పరివర్తనం పొందుతూ వుంటవి. స్వేచ్ఛగా వ్యక్తి జీవితపు విలువల్ని ఎంచుకోవాలి అనిగూడా సార్త్ర్ అభిప్రాయం వెలిబుచ్చాడు జీవితపు విలువల్ని నిర్ధారణ చేయడం మంచిదే. కాని మారిన పరిస్థితులనూ, యుగ ధర్మాలనూ గుర్తించక పోవడం వలనా, తదను గుణ్యమైన మార్పులు చేసుకొనక పోవడం వలనా వ్యక్తి జీవితంలో కుళ్ళు యేర్పడే ప్రమాద ముంటుంది. ఆ విలువలు గూడా రెండు రకాలుగా వుంటవి. కొన్ని సార్వకాలికమైనవి, సార్వదేశికమైనవి. మరికొన్ని ఆయా దేశాలు, యుగాలు, సమాజాలు, జాతులు మొదలైన వాటికి సంబంధించి యేర్పడుతున్నవి. కనుక విలువల్ని యేర్పరుకొనడంలోనూ వాటిని అనుసరించడంలోనూ గూడా జాగరూకత అవసరమని అస్తిత్వవాదుల అభిప్రాయం.

## కాలము, ఇతిహాసము

మానవుని అస్తిత్వానికి కాలానికి సంబంధముంటుంది. మనుష్యుని అస్తిత్వం మీదనే కాలం ఆధారపడి వుంటుంది. ప్రతి వ్యక్తికి భూతభవిష్యత్కాలాలుంటవి. మనుష్యుడు అతీతాన్ని ఉపేక్షించలేడు. అతీతం కారణంగానే, నేటి వర్తమాన స్వరూపం యేర్పడుతున్నది. భవిష్యత్తును అతడు నిర్మించుకొనవలసివున్నది. అందుకు భూత వర్తమానాలు ఉపకరించగలవు.

అస్తిత్వవాదులు కాలం, ఇతిహాసమనేవి మానవుని అస్తిత్వానికి పునాదులవంటివని యేకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. ప్రాణులలో కాలంతో సంబంధమున్నవాడు మానవుడొక్కడే. వర్తమానంలో స్థితిని భవిష్యత్తులో అతడు మార్చుకొనగలిగిన శక్తికలిగి వున్నాడు. అతీతాన్ని వదలకుండానే భవిష్యత్తును దృష్టిలో పెట్టుకొని వర్తమానాన్ని అతడు సరిదిద్దుకొన గలడు. అందువలన కాలానికి ఇతిహాసానికి అస్తిత్వవాద దర్శనంలో చాలా ప్రాముఖ్యమున్నది.

అస్తిత్వవాది జీవిస్తున్న మనుష్యుడు. అతడు క్షణ క్షణంలో జీవించి వుంటాడు. ప్రతి క్షణంలోనూ అతడు తనను తాను పునః సృష్టించుకొంటూ వుంటాడు. అంటే అస్తిత్వవాదంలో ప్రతిక్షణానికి ఎంతో ప్రాముఖ్యత యేర్పడుతున్నది, ఈ క్షణాలే కాలం. వ్యక్తి క్షణాలలో జీవిస్తాడు. సార్త్ర్ "ఈ క్షణాన్ని మానసిక శక్తి" అన్నాడు. క్షణాల సమాహారమే కాలం.

అస్తిత్వవాది తానుచేసే కర్మద్వారా తన అస్తిత్వానికి అర్థకల్పన చేసుకొంటాడని ఇది వరకే మనం తెలుసుకొన్నాము. దానినిబట్టి కర్మకు చాలా ప్రాముఖ్యం ఏర్పడుతున్నది, అర్థవంతమైనజీవితం జీవించవలెనంటే ఆపదలను చూచిభయపడకూడదు ఆటంకాలను తొలగించే ప్రయత్నం చేయాలి మనుష్యులో కొత్త శక్తిని పెంపొందించాలి.

జాస్పర్స్ నిర్వచనం ప్రకారం మానవుడు, అసత్యము, మోసము, కపటము, మృత్యువు వంటి వాటితో ఎల్లప్పుడూ చుట్టబడి వుంటాడు. వాటి మధ్యనుండి పయనం సాగిస్తాడు. నిస్సారమైన వాటి మధ్యవుంటూనే కార్యరతుడవుతాడు.

అస్తిత్వవాదులు నిరాశ, వ్యధ, ఏకాకితనం, అపరాధ ప్రవృత్తిమొదలైనవి ప్రతిమానవునిలోనూ వుండే అనివార్య లక్షణాలంటారు. కిర్కెగార్డ్ నిరాశకు ప్రముఖ స్థానాన్ని చ్చాడు. అనుకొన్నది అనుకున్నట్లు సాగక, తనప్రయత్నాలకు ఫలితం లభించకపోతే నిరాశ నిస్పృహలు కలగడం సహజమే. విసంగతుల మధ్య కొట్టుమిట్టాడుతున్న "చేతన, వాతావరణం, పరిస్థితులు కారణంగా తనకు తాను అపరిచితమైనట్లుగా భావిస్తుంది. దీనిని ఆత్మ విస్మరణ" అంటారు అస్తిత్వవాదులు [డాస్టోవస్కీ కాఫ్కాల రచనల్లో ఇదిచాలా ఎక్కువగా కనబడుతుంది. ఒక ఉదాహరణ, కోర్టులో ఒక పెద్దకేసు జరుగుతుంది. నిర్ణాయకులు అజ్ఞాతంగా వుంటారు. కాగితాలు గుప్తంగావుంటవి. శిక్షపడడం పూర్వనిర్ణయం. ఆరోపణలు చేసే వారికి ఆరోపణలు ఋజువు చేసే బాధ్యత వుండదు ఇది చిత్రణ.

మనుష్యుడు అపూర్ణుడు, హద్దులు కలవాడు. అందువలన అతనికి ఆర్థిక రాజకీయాలతో సంబంధించిన అనేక సంఘర్షణలలో పాల్గొనవలసి వస్తున్నది. నేటిట్లాచేస్తే జాగుండేది

నేనట్లాచేయగలిగేవాణ్ణిఅని అనుకోవడంసహజం. దానివలన మానసిక వొత్తిడి ఏర్పడి అపరాధ ప్రవృత్తి జాగృతమవుతుంది అంటాడు. జాస్పర్స్, సాధారణంగా మనుష్యులు తాము అపరాధం చేసి ఇతరుల మీదకో, పరిస్థితులమీదకో దోషాన్ని నెట్టి వేస్తారు. తన తప్పును అంగీకరించరు. ప్రతిదానినీ ఎవరిమీదకోతోసి వేయాలనిప్రయత్నంచేస్తారు. మంచి తను చేసినట్లు చెడు ఎవరో చేసినట్లు బుకాయిస్తారు. ఆపరాధాన్ని స్వీకరించ గలిగిన ధైర్యం వుండడం ఆవసరమంటారు అస్తిత్వవాదులు.

మృత్యువనేది మనుష్యుణ్ణి ఎప్పుడూ జాగరూకుణ్ణి చేస్తుంది. తాను వెనక ఎవరో తనకు తెలియదు. చనిపోయిన తరువాత ఎక్కడికి పోతాడో తెలియదు. అంతా అజ్ఞాతం. క్షణక్షణం తాను మృత్యువువైపుకు ప్రయాణం చేస్తున్నాడు. అది అతనికి తెలుసును. దానితో మృత్యువుకు పూర్వమే తాననుకొన్నపనుల్ని పూర్తి చేయలేనేమోనని భావం ఒకటి అతనిలో బయలుదేరుతుంది. ఇదంతా ఒక విచిత్రస్థితి.

ఈ లోకంలో ముఖ్యంగా ఆనందంగా వుండవలెనని ప్రతి వ్యక్తి కోరుకుంటాడు. ఎక్కువ కాలం జీవించ వలెననీ కోరుతాడు. తన అస్తిత్వానికి, ఈ ప్రాకృతిక విశ్వానికీ దగ్గరసంబంధం ఏర్పర్చుకొనవలెనని ప్రయత్నిస్తాడు. కాని తన ప్రయత్నం ఫలించక పోవడం చూస్తాడు. తన కోరికలు వమ్ము గావడం చూసి ఒక విచిత్రస్థితికి చేరుకుంటాడు. అస్తిత్వవాదులు లభించిన జీవిత స్వరూపాన్ని బట్టి అతని మానవ సహజమైన కోరికలు ఫలించడం సంభవంగాదని అభిప్రాయం వెల్లడిచారు. దానికి విశ్వంలో వ్యాప్తంగా వున్న అసంగతులు విసంగతులు కారణం అన్నాడు కామూ. విసంగతులను వివరిస్తూ కామూమానవుని దైనిక జీవితాన్ని ఉదాహరణగా చూపించాడు. ఉదయం లేవడం బస్సో, రైలో పట్టుకోవడం, మూడునాలుగు గంటలు ఫ్యాక్టరీలోనో, ఆఫీసులోనో పని చేయడం, భోజనం చేయడం, మళ్ళీ మూడు నాలుగు గంటలు పని జేయడం, భోజనం చేయడం, నిద్రపోవడం. సోమ మంగళ బుధ, గురు.... ఎక్కువగా ఇదే కార్యక్రమం. ఒకరోజు ఇదంతా ఏమిటి? అని ప్రశ్నించు కొనక తప్పదు దీనికి సమాధానం ఏమీలేదు. కామూ దీనినే విసంగతి అంటాడు. ఇదంతాదేనికి? ఎందుకు? దీనికి పరమార్థం ఏమిటి? అంతా అనిశ్చయమే. సార్త్రె తన రచనల్లో ఉల్లేఖించిన మూడు సందర్భాలను ఉటంకిస్తాను.

"ఈ ప్రకాశం ఎంతగా విశ్వంతో సంలగ్నమై వున్నదో, నేను గూడా విశ్వంతో అంతగా సంలగ్నమై వున్నాను. కాని నేను పైపైన నడుస్తున్నాను ఏ వస్తువూ లోతుల్లోకినన్నుతీసుకొనిపోలేక పోతున్నది. నేను అపరిచితుణ్ణి అతీతం నుండి నిర్వాసితుణ్ణి. స్వతంత్రుడనై జీవించి నందుకు నాకు శిక్ష లభించింది."

"నేను ఎవ్వరికీ పట్టినవాణ్ణిగాను. నేను లేకపోయినా నన్నెవ్వరూ గుర్తించరు. రైల్లోజనంగుంపు అట్లాగేవున్నది, హోటళ్లు జనంతో అట్లాగే నిండి వున్నవి. ప్రతివ్యక్తి చిన్న చిన్న విషయాలకు గూడా ఉద్రేకపడుతున్నాడు. నేను లోకంలో నుండి తప్పుకొన్నా లోక వ్యవహారాలన్నీ యధావిధిగానే జరుగుతున్నవి నిజమైన విషయమేమంటే నేనీలోకానికి అవసర మైనవాణ్ణి కాను"

"నేనిక్కడినుండి వెళ్లవలెనని అనుకొంటున్నాను. నాకు అనుకూలమైన చోటికి పోవలెనని నా అభిప్రాయం. కాని నాకు తగినచోటు ఏదీలేదు. నాకు ఎవ్వరూ లేరు. శని వారం, ఆదివారం అన్నీ నాకు సమానంగానేవున్నవి వారాలు వస్తున్నవి, పోతున్నవి."

## మృత్యువు

మానవజీవితంలో చివరిహద్దు మృత్యువు. మృత్యువును గురించి అనేక విధాలుగా ఆలోచించవచ్చును క్రీస్తు ధర్మం ప్రకారం అది శాశ్వతజీవిత ప్రారంభం. హిందూ ధర్మం ప్రకారం పుట్టుకలాగానే అది జీవితధర్మం. కీర్కెగార్డ్ మృత్యువు ఒకచాలెంజి అంటాడు. జాస్పర్స్ ప్రకారం మానవుని అస్తిత్వానికి సంబంధించిన స్వాభావిక పరిణామం మృత్యువు. కామూ వ్రాసిన అవుట్‌సైడర్ నవలలోని— నాయకుడు— మనుష్యుడు తన జీవితాన్ని ప్రేమిస్తున్నాడు అందువలన అతడు మంచి మృత్యువును కోరుకొంటాడు. అదిస్వాభావికమే. మృత్యువుతప్పనప్పుడు అది ఏరూపంలో వుంటే ఏమిటి? అంటాడు. మృత్యువు తప్పదు. దానిని ప్రేమగా స్వీకరించడం మంచిదంటాడు హెడ్‌గర్.

అస్తిత్వవాదం ఒక దర్శనంగా రూపొందింది. ఇది మానవుని ఆంతరిక జీవితాన్ని విశ్లేషించ గలిగింది. ఆత్మగతచింతనా విధానానికి ప్రాముఖ్యానిచ్చింది. అన్నిటికంటె ముఖ్యంగా సమర్థులైన సాహితీ స్రష్టల కలం నుండి వెలువడి విశిష్టరూపాన్ని సంతరించుకొన్నది. యూరపులో వెలువడిన సాహిత్యోద్యమాలన్నింటిలో అస్తిత్వవాదంతాలూకు

ఛాయలు మనం చూస్తున్నాము విశ్వయుద్ధాలు కారణంగా, యాంత్రిక నాగరికత అభివృద్ధి జెందటం ద్వారా ఈ వాదానికి ఎక్కువ ప్రాముఖ్యం లభించింది. హేతు వాదదృష్టి, మనో విజ్ఞానం వంటి విశేషప్రక్రియల ప్రభావం వలన ఈ వాదం ఎక్కువ ప్రభావవంతమైనది. ఈనాటి రచనల్ని-ఆధునిక సాహిత్యాన్ని-అర్థంచేసుకొనవనంటే ఈ వాదాన్ని గురించి తెలుసుకొనడం చాలా ఆవసరమవుతున్నది, సిద్ధాంతపరంగా అ స్తిత్వవాద ఆచార్యులువెల్లడించిన మూలతత్వాలన్నీ సాహితీ స్రష్టలరచనల్లో ప్రతిబింబించకపోవడంసహజమే మక్కికి మక్కీగా సిద్ధాంతాలను అనుసరించి రచనలు సాగించడం సంభవంగాదు, ఉచితంగాదు. అయినా మానవునిఆంతరంగికజీవితాన్ని వివరించడంలోనూ విశ్లేషించడంలోనూ అ స్తిత్వవాదులు తమ రచనల ద్వారా ఆద్భుతమైన విజయాన్ని సాధించారు ఈనాడు విశ్వసాహిత్యంలో దానికొక ప్రత్యేక స్థానం లభించడమే గాక విశ్వభాషలన్నింటిలోకీ, అన్ని భాషల సాహిత్యంలోనికీ ఈ వాదం ప్రవేశించింది. తెలుగులోకి ఈవాదంతాలూకు సిద్దాంత గ్రంథాలు ఆనూదితాలు కావలసి వున్నవి. ప్రాచ్యపాశ్చాత్య సాహిత్య సిద్ధాంతాల కలయికగా ఆధునిక సాహిత్యం రూపొందుతున్నది. విశ్వమంతా ధగ్గర దగ్గరకు చేరుతున్నది. ప్రచారసాధనాలు పెరుగుతున్నవి. కనుక విశ్వమానవతా నిర్మాణానికి సాహిత్యం తోడ్పడివలసివున్నది.

భారతీయ కావ్యసాహిత్యాన్ని గురించి తెలుగులో కొన్ని ఉద్గ్రంధాలు వెలువడ్డవి. కాని,పాశ్చాత్య కావ్య సంప్రదాయాలకు సంబంధించిన గ్రంధాలు వెలువడలేదు ప్లేటో,ఆరిస్టాటిల్ వంటి వారి గ్రంధాలు గూడా పెద్ద ఎత్తున తెలుగులోకి రాలేదు. ఉత్సాహమున్న వారు ఇంగ్లీషను ఆశ్రయిస్తున్నారు, ప్రపంచంలో ఎమూల యేభాషలో మంచి గ్రంథం వెలువడ్డా అది ఇంగ్లీషులోనికి వస్తున్నది. అందువల్లనే ఇంగ్లీషుకు అంత ప్రాముఖ్యం ఎర్పడుతున్నది. హిందీలో ఇటువంటి ప్రయత్నం ప్రారంభమైనా తెలుగు వంటి భారతీయభాషల్లో చెప్పుకోదగిన కృషియేమీ జరగడం లేదు. సాహిత్య అకాడమీల వంటివి పూనుకొంటే కొంత కృషి జరగవచ్చును. వారు ఇంకా భారతీయ ప్రాచీన కావ్యాల పరిధినుండి బయటికి రావడలలేదు. తెలుగులో ఆధునిక సాహిత్యం మీద విమర్శన గ్రంధాలు వెలువడకపోవడానికి మూల సిద్ధాంత గ్రంధాల అభావం గూడా కొంత కారణంగా కనబడుతున్నది జి. వి. కృష్ణారావుగారు వంటి వారు కొంత ప్రయత్యం చేశారు అది అంతతో ఆగిపోయింది, అ స్తిత్వవాద రచనలు తెలుగులో గూడ ప్రచురించబడుతున్నవి. కొన్ని నవలలు వచ్చినవి, కథాకలు ఎక్కువ వచ్చినవి. కొన్ని నాటకాలు వచ్చినవి. రచనకు ప్రతిభ అవసరం. అయినా సిద్ధాంత పరిజ్ఞానం గూడా అపసరమే. ఇది కేపలం అ స్తిత్వవాదం విషయంలోనేగాదు సర్రియలిజం వంటి సాహిత్య ప్రక్రియలు చాలా ఉన్నవి. సర్రియలిజం లాంటి వాటిని గురించి అపప్రథలు గూడా ఉన్నవి. అవన్నీ నిజంగాదు. ఫ్రెంచివాదు, ఇంగ్లీష వారు, అమెరికన్లు సర్రియలిజం రచనలు విరివిగా చేశారు. అవన్నీ అరాజకప్రవృత్తి మాత్రమే లక్ష్యంగలవిగావు. సమయాన్ని బట్టి, యుగాన్ని బట్టి, పరిస్థితులను బట్టి అవి వెలువడ్డవి. మంచి ఎక్కడ వున్నా కొత్తదనం ఎక్కడ వున్నా సాహిత్యారాధకులు దానికి స్వాగతం చెపుతారు. వాళ్ళు నూతిలోని కప్పలు గారు. కాగూడదు.

* * * *

వేమూరి ఆంజనేయశర్మ
హైదరాబాదు




## 'శ్రీరామోదాహరణము'

రచన : పెన్గలూరి వెంకటాద్రి

సంస్కృత లాక్షణికులు ఉదాహరణ సాహిత్యాన్ని కూడ పేర్కొన్నారు-, దేవతోపాసన, స్తుతిపరమైన సాహిత్యము- విభక్త్యంతములతో కూడియుండుట ఉదాహరణ సాహిత్యలక్షణము-అన్నవిభక్తులతో పరమేశ్వరుని చెప్పుటయే దీని ఉద్దేశ్యము- ప్రాచీనులు ఉదాహరణ వాఙ్మయాన్ని ఉద్ధరించుట మనమెరుగుదుము-కాని ఆధునికులు యీ ప్రక్రియను చేపట్టడం తక్కువ-

విశ్వనాధ గోపాలోదాహరణం- చలమచర్ల రామానుజోదాహరణ- నిడదవోలు శ్రీరామోదాహరణవంటివి ఇటీవలికాలంలో వచ్చినవే.

ఈమధ్య వచ్చిన "శ్రీరామోదాహరణము వస్తురూపం"లో చిన్నదైనా గుణముమాత్రం మిన్న, ప్రాచీన చట్రంలో చక్కగా బిగించినారు. శ్రీ పెన్గలూరి వెంకటాద్రిగారు- కేవలం విభక్త్యంతములే కాక,

స్తోత్రరూపమైన యీ ఉదాహరణ కృతి నాయకీ గుణకీర్తన లక్షణాలతో నిండి ఉన్నది- ఆధునిక సాహితీక్షేత్రంలో ఉదాహరణప్రక్రియలో వచ్చినయీ లఘుకృతికి స్థానమేకాదు- కీర్తికూడ లభిస్తుంది- సంపాదకులు కపిలవాయి లింగమూర్తి యీ కృతిని ప్రకటించినందులకు ధన్యులు-

శ్రీరామోదాహరణము
పెన్గలూరి వెంకటాద్రి
వెల 2=00

ప్రతులకు :—
వెలిదెండ వెంకటరామ
11-2- సబ్‌రిజిష్ట్రార్ ఆఫీసుప్రక్కన
నాగర్‌కర్నూలు-509209 వ్రాసి పొందవచ్చు—

## జాతిపిత

రచన:-ఎం.పి జానుకవి.
కత్తి రామయ్య వీధి : బాప్పిస్సుపాలెం.
విజయవాడ 16.
వెల:-అయిదు రూపాయిలు.

'దేశస్వాతంత్ర్య సంగ్రామం సైనికులను, జాతీయ నాయకులనేకాదు మామూలు పౌరులను గూడ ఉత్తేజితుల్ని చేసింది. ఆ రోజుల్లో అందరినోళ్ళల్లో జాతీయ గేయస్రవంతులు ప్రవహించేవి. రచయితలలో-ఆవేశము, ఉత్తేజము పెల్లుబికి - ఎన్నో ఉత్తమ, రచనలకు ప్రోదిఅయింది - స్వేచ్ఛా సమర వీధిలో 'గాంధి' అగ్రగామి. జాతీయ నాయకులకు మార్గదర్శి 'గాంధి' వస్తువుగా కావ్యాలు, నాటకాలు - గేయాలు పుంఖాను పుంఖంగా వచ్చేయి. గుఱ్ఱం జాషువా గారు 'గాంధీజీ' కావ్యం వ్రాశారు. కాటూరి వేంకటేశ్వర రావుగారు, వేటూరి శివరామశాస్త్రిగార "గాంధీజీ ఆత్మ

కథ"లకున్న ఖ్యాతి అఖండము. 'బోసి నోర్విప్పితే రతనాలు. మాగాంధికోమపై పుట్టితేనేమి' వంటి గేయాలు ఇప్పటికే ఎవ్వరూ మరువజాలరు- దాశరథి గారు మనోహరంగా గాంధీజీ గూర్చిన పద్యాలు వ్రాశారు.

ఇటీవలి కాలంలో "ఏం.పి. జానుకవి" గారి జాతిపిత పద్యకావ్యం-అతి సరళ సుందరంగా, ద్రాక్షా పాకంలో వచ్చింది - ప్రతిపద్యం రసగుళికలావుంది-ధార అసి ధారగా-ప్రసన్నత భూషణంగా భావం బలంగా యీ కావ్యానికి మెరుగులు దిద్దాయి.

గాంధీజీ జీవితంలోని ముఖ్య ఘట్టాలను తీసుకొని వ్రాశారు. బాల్యం; సీమచదువులు; దక్షిణాఫ్రికా పోరాటము; గాంధీ మార్గము హరిజనోద్ధరణము; సత్యాగ్రహ సహనిరాకరణములు (ఆయుధంగా ప్రభంజనము-ఉప్పు సత్యాగ్రహ-చివర ఫల శ్రుతి - ఇలా విషయ విభజనతో స్వాతంత్ర్య సమరగాధను, బాపూజీ జీవితంతో చక్కగా అనుసంధించారు 'ప్రభంజనము-ఉప్పు సత్యాగ్రహం' బాపూజీ జీవితంలో సమర ఘట్టాలు-సమరశీలిగా, బ్రిటిష ప్రభుత్వానికి తిరుగు బాటు దారునిగా-విప్లవ యోధునిగా చిరస్థాయిపొందిన గాంధీజీని వర్ణించారు.

'నమ్మిన శాంత్యహింసలు
తృణమ్మును మేరువుచేసి నిల్పి, ని
త్యమ్మును విశ్వధాత్రికి
ముదంబొన గూర్చుటెకాక, పారతం
త్ర్యమును రూపుమాపెడి
మహోద్భుత శక్తికి తావలంబు, లం
చమ్మహనీయమూర్తి సల్పెడి
సంస్థలన్ నిలిపె సంస్కారంబురం జల్లగన్.

'హరిజనోద్ధరణము' గురించి చెబుతూ నాటి సాంఘిక దురాచారాల్ని

"బావులనంటరాదు,
కడుపారగ కూడు భుజింపరాదహో
పోవగరాదు; స్వేచ్ఛమెయి
మూలల యందు నివాసముండి స
ద్భావములెల్ల చంపుకొని
బానిసగా బ్రతుకీడ్వగావలెన్
ఏ విధి నిర్ణయించె పరమేశ్వర
పంచమ జాతికిట్టులన్-అని

అంటారు-జాషువా కవిని ఆదర్శంగా తీసుకొని కొన్నిచోట్ల వ్రాశారనుకోవచ్చు.

ఈ కావ్యం అద్యంతము ఒక్కధారలో సాగింది-తడుముకోకుండా చదువుతూ పోవచ్చు. బాల్యం నుండి ఫల శ్రుతి వరకు అవిశ్రాంతమైన ఒరవడితో సాగింది రచన.

కావ్యానికి విబుధులు, ఆచార్యులు శ్రీ దివాకర్ల వెంకటావధాని ఆశీస్సుల వల్ల కవితకు పరిమళం అబ్బింది.

పైగా రసశేఖరులు, వదాన్యులు, న్యాయశాస్త్రిభిజ్ఞులు శ్రీ అవుల సాంబశివరావుగారికి "కృతి సమర్పించడం" ఈ కావ్యానికి మరింతి యశోభూషణ మయింది.

జాతీయతత్వము, దేశభక్తి-సేవా దీక్ష సన్నగిల్లుతున్న యీ రోజుల్లో-తళుక్కున మెరిసిన మెరుపు లాగా యీ కావ్యం అవతరించింది.

ముఖ్యంగా విద్యార్థులకు ఆదర్శ గ్రంథంగా వుంటుందని ఆశించవచ్చు—

# దేశదేశాల కథలు

పూర్వపురోజుల్లో 'అనగనగా' అంటూ కథలుండేవి రాజులు రాజ్యాలు- ఆ రాణుల ప్రేమపురాణాలు కావు కథలకు మూలం :

ప్రస్తుతం "కథ"కు మూలవస్తు మానవుడు-సామాన్యుని జీవనం- జీవితకథావస్తువులై కూర్చున్నవి— రచయితల మనోదృక్పథాల్లో విహరించే వస్తూనే నేటి వ్యవస్థ- వ్యవస్థను ఉన్న దున్నట్లు చూపగలిగితే

ప్రక్రియ బహుశా కథేకావచ్చు లేకుంటే కథకింతబలం రాదు.

ఒకచోటకూచుని "దేశకాలకథలు" ను మనం చదువుకోడానికివీలుగా "గాదంశెట్టి శ్రీరాములు" గారు చక్కని కథామాలను కూర్చారు...

ప్రసిద్ధులైన హిందీ. గుజరాతీ మరాఠీ- కన్నడ రచయితల గాథలు మనముందుంచారు-

ఇవేకాదు సోమల్ సెట్ మామ్, చఖోవ్, డెల్ జన్ పీటర్ టేట్‌వంటి ప్రసిద్ధ పాశ్చాత్యకథకుల కణలూ ఉన్నాయి- ఇన్ని కథలను సరళమైన తెనుగులో అను వదించి, పరభాషా పరిమళాలను అందించారు- రష్యా ఇంగ్లాండు అమెరికాలోని జనజీవనగతులని- జీవన రంగంలోని ఒడుదుడుకులను- అవస్థలను వ్యవస్థలను తెలుగులోకానికి అందించిన శ్రీ శ్రీరాములుగారిని అభి నందించక తప్పదు- మరాఠీజోషి- సరోజినీ మహిషి హిందీకథ బహుమతి- మామ్-ఇంగ్లండు కథ అద్భు తాలు ఉద్యోగరీత్యా హిందీభాషోపన్యాసకులు వీరు— వీరి భాషాపాటవము- కళాకథనము ప్రతికథలోకన్పడు తుంది-

ఈ కథలు కావాలనుకొనేవారు
జి. గోవిందలక్ష్మి;
తూర్పుబ్రాహ్మణవీధి
W/5 205 - గూడూరు-
నెల్లూరుజిల్లాకు వ్రాసి తెప్పించుకోవచ్చు. ధర 5/- అందుబాటులోనే వుంది-

# కొరవి గోపరాజు సాహిత్య విశ్లేషణ

డా॥ అండ్లభూమయ్య
ప్రతులకు- శ్రీమతి పి. లక్ష్మి
4 నెం. 5-8-56 లష్కర్‌బజార్
హన్మకొండ 506001,
వెల రు. 12-00

తెలుగుసాహిత్య వీధులలో ఇతిహాస పురాణకావ్య సంపద శ్రీనాథుడు; పోతన; పెద్దన్నల చేతులమీద సాగితే... కథాసాహిత్యం జక్కన కొరవి గోపరాజు చేతుల్లో పుష్టిపొందింది. వీటన్నిటికి సంస్కృతం మూల మైనప్పటికి- దేశీయసారస్వతము సాఫల్యం చెందింది. భేతాళపంచవింశతి; దశకుమారచరిత్ర విక్రమార చరిత్ర; శుకస ప్తతి; గాథాస ప్తసతి మొదలగునవి కథా సంహితలు :

విక్రమార్కుని ఆదర్శరాజుగా ఒక్కొక్కరాజు కథ వ్యక్తిత్వంలోని ఒక్కొక్క పార్శ్వాన్ని రూపుకట్టిస్తుంది. ఈ గ్రంథంలో మహా రాజున కుండవలసిన దీక్ష-సాహసము- ఉపజ్ఞత— సూక్ష్మవివేకము మొదలైన లక్షణాలను ఈ కథలోని బొమ్మలు చెబుతాయి- కథరసవ త్తరంగావుంటుంది-

కథాసాహిత్యంలో సింహాసనా ద్వాత్రింశక కున్న ప్రత్యేకతను చక్కగా విశ్లేషించారు- మంచి విమర్శనా దృష్టి- తగినంత కృషిలో చూపు బీజభూతంగా కనిపి స్తాయి. అవతారిక తెలుగులో కథాకావ్యం- అనువాద విధానం కథానిర్మాణమార్మికత- వర్ణనా నిపుణత- అంగాంగిరస వివేకం- కవితావిశ్లేషణ I కవితావిశ్లే షణ II

గోపరాజు హరిహరినాధుడు- అనువిషయ విభజ నలద్వారా గోపరాజుయొక్క సాహితీ విశ్వరూపాన్ని చూపారు. అంగాంగి రసవివేకం పరిచ్ఛేదములో- వీర రసములో అంతర్వాహినిగాయున్న ; తపోవీరము; కళా వీరము, యుద్ధ; దాన, దయా, క్షమా, త్యాగ,

ఐశ్వర్య, బల, త్యాగయోగ, అహింసాది 20 పీఠము లను సోదాహరణంగా విశ్లేషించి తమ విమర్శనా పాట వాన్ని పతాక కెత్తినారు.

మార్గదేశి సంప్రదాయాలు విజృంభించిన రోజుల్లో ఈరెండుమార్గాల సారూప్య-విరూప్యాలను "కవితా విశ్లేషణ" విభాగంలో ప్రదర్శించారు చెఱకుగడలు తినుట గంటెగసముగ్రోలుట యెట్లుసులభమో- కొరవి గోపరాజు "తెనుగుతేట" యట్లుండును- చివరలో హర నాథతత్వాన్ని గోపరాజు; పూర్వకవులవలె ఎట్లాద రించాడో- సవిమర్శంగా- సాలోచనగా, సోదాహర ణంగా వివరించారు- నాయనిసుబ్బారావు కృతులపై పరిశోధన గావించిన అండ్ల భూమయ్యగారి; ప్రతిభా ధిషణావివేచనలకు ఇది మనోదర్పణం.

—ఎస్. రామానుజాచార్యులు

## బాలగేయాలు

రచన-డా. ఎన్. గంగప్ప
వెల రూ. 5=00
ప్రతులకు-నవోదయ పబ్లిషర్స్
ఏలూరు రోడ్, విజయవాడ-2

డా గంగప్ప వివిధ రచనలతో తెలుగు సాహిత్య క్షేత్రాన్ని పండిస్తున్న మనీషి నాటక, జానపద, పద, విమర్శ, నవల మొదలైన ప్రక్రియల్లో గ్రంథాలను ప్రకటించారు. అలాంటి విద్వాంసులైన గంగప్పగారు అంతర్జాతీయ బాలల సంవత్సరాన్ని పురస్కరించు కొని ఈ 'బాలగేయాలు' సంతరించడం ముదావహం. ఇందులో 48గేయాలున్నాయి. ప్రతిగేయమూ బాలలకు సులభంగా అర్థమయ్యే రీతిలో, ఉత్సాహాన్ని రేకె త్తించే తీరులో వ్రాయడానికి ప్రయత్నించి చాలా వరకు కృతకృత్యులయ్యారు. అక్కడక్కడ చిన్నారి పాప లకు కొరుకుడు పడని పదబంధాలు చోటు చేసుకోవ డం చింత్యం. "అమేయ జ్ఞానమౌని సమధిష్ఠిత తపో వనాలు" "అనంత ప్రపూత హోమాగ్ని ధూపమాలి కలు" పరివ్యాప్త పరిమళాలహేల" "సర్వజనతా సుషుప్తి" ఈ మొదలైన శబ్దగ్రంధులు చిట్టి బాలలకు మింగుడు పడతాయా? అనే సందేహం కలుగక మానదు ఐతే ఎన్నోగేయాలు సరళంగా, లలితంగా, ప్రబోధాత్మకంగా ఉండి పిల్లలను ఉత్సాహంతో చదివి స్తాయి ఇందుకు ఈ క్రింది గేయ పంక్తులు ఉదాహ రణగా చూడవచ్చు.

"చిట్టి పొట్టి పిల్లలం
చింతలేని పిల్లలం
జాతి మతాలు లేవు మాకు
కులవర్ణాలు లేవు మాకు"

"రింగు చేస్తే చాలు
రింగు రింగున మోగుతుంది
హలో హలో అంటే చాలు
అవతలి గొంతు వినిపిస్తుంది"

"కష్ట జీవులం-కాయ
కష్ట జీవులం
కండరాలు కరగిస్తాం
బండరాలు పగిలేస్తాం
రత్నాలు రాగదీస్తాం
ముత్యాల ముగ్గులేస్తాం".

"వర బట్టిన గాణిక్యం" అనే పంక్తిలోని 'గాణి క్యం' అనే పదం వాడడం ఉచితంగా లేదు. గాణిక్యం అంటే గణికల సమూహం కదా!

—వేముగంటి

# వార్తావాహిని

## ప్రమాణపత్రవితరణోత్సవము

### హిందీ ప్రేమీ మండలి-మచిలీ పట్టణము

ది 10-7-83న స్థానిక మ్యునిసిపల్ హైస్కూలులో హిందీ ప్రేమీ మండలి ప్రమాణ పత్రవితరణోత్సవము జరిదినది. మండలి అధ్యక్షులు శ్రీ నాయుడు నాగేశ్వరరావుగారు అధ్యక్షత వహించిరి. కృష్ణాజిల్లా సహాయ విద్యా శాఖాధికారి శ్రీ బి. వి. రాయలు గారు ముఖ్య అతిథిగా విచ్చేసిరి.

మండలి సహాయ కార్యదర్శి టి. యల్. కాంతా రావు స్వాగత వచనములు పలికిరి.

మండలి కార్యదర్శి శ్రీ కె, యన్. నాంచారరావు గారు వార్షిక నివేదిక ద్వారా జరుగుచున్న కార్యక్రమములను వివరించిరి. హిందీ పండితులు శ్రీ డి.వి. నరసయ్యగారు హిందీ భాష విశిష్టతను-గూర్చి ప్రసంగించిరి.

మండలి అభివృద్ధికి హిందీ ప్రచారమునకు కృషి సల్పిన కుమారి కె ప్రసూనాంబ గారిని మండలి పక్షాన సత్కరించిరి.

శ్రీ టి. యల్. కాంతారావు వందన సమర్పణతో సభ ముగిసినది.

## ప్రమాణపత్ర వితరణోత్సవము

### నిడదవోలు

ది 10-7-83 సంవత్సరం తారీఖున నిడదవోలు హిందీ ప్రేమీ మండలి ప్రమాణ పత్ర వితరణోత్సవము సా. 4గం॥లకు శ్రీయుతులు తేతలి శేషగిరి రావు గారి అధ్యక్షతన జరిపినది.

సభకు పలువురు పుర ప్రముఖులు విచ్చేసిరి.

కార్యదర్శి శ్రీ ఎన్. సి. హెచ్. సత్యనారాయణ శర్మ తన నివేదికను సమర్పించిరి. అధ్యక్షులు సర్వ ప్రధమ ద్వితీయ బహుమతులను పంచగా, శ్రీమతి కె. ఎమ్. లలిత గారు ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష, మరియు ప్రవేశిక ఉత్తీర్ణ విద్యార్థులకు విజయ పత్రములు అందజేసిరి.

కార్యదర్శి వందన సమర్పణతో సభ ముగిసినది.

—o—

## భారత హిందీ మహా విద్యాలయం (రిజిష్టర్డ్)

### మచిలీపట్టణము;

### భవన నిర్మాణం శంకుస్థాపన.

ది. 20.6 1983న స్థానిక హిందూ కళాశాల గల స్థలంలో భారతీ హిందీ మహా విద్యాలయ నూతన భవన నిర్మాణానికి శంకుస్థాపన కృష్ణాజిల్లా కలెక్టర్ శ్రీ పి రమాకాంత్ రెడ్డి చేసినారు.

ఈ సందర్భంలో జరిగిన సభకు శ్రీ సి. ఎల్. నరసయ్య అధ్యక్షత వహించినారు. అధ్యక్షులు భారత హిందీ మహా విద్యాలయమునకు 10 సెంట్లు స్థలం భవన నిర్మాణం నిమిత్తం కేటాయించినందులకు జిల్లా పాలన యంత్రాగానికి, ముఖ్యముగా కలెక్టర్ గారికి కృతజ్ఞతలు తెలియ జేసిరి. హిందీ మహా విద్యాలయ కార్యదర్శి శ్రీ చలమల శెట్టి శేషగిరిరావు నివేదిక సమర్పిస్తూ ఇంత వరకు విద్యాలయం 4400 మంది హిందీ పరీక్షార్థులకు శిక్షణ నిచ్చిందని, స్థానిక పుర ప్రముఖులు, హిందీ పండితులు, అనేక విధములుగా హిందీ విద్యాలయమునకు తోడ్పడి నందులకు వారికి

కృతజ్ఞతలు తెలిపిరి. విద్యాలయం ఇంత వరకు నిర్వహించిన హిందీ భాషాబోధనతో పాటు సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమములను వివరించిరి. ఆ సభలో శ్రీ చలమలశెట్టి నాంచారయ్య రూ 3000/-లు విరాళమిచ్చెదనని, శ్రీ మహమద్ ఇస్మాయేల్ రూ 500/-లు విరాళమిచ్చెదనని వాగ్దానం చేసిరి. కార్యదర్శి వారికి కృతజ్ఞతలు తెలియపర్చిరి.

ముఖ్య అతిథిగా విచ్చేసి శంకుస్థాపన చేసిన శ్రీ పి. రమాకాంతరెడ్డి (కృష్ణాజిల్లా కలెక్టర్) యీ సందర్భంలో మాట్లాడుచూ "ప్రతివారు తమ మాతృ భాషతో పాటు మరో రెండు భాషలు నేర్చుకొనడంవల్ల భాషా పరమైన చిక్కులు యెదురుకాక పోవుటయేగాక, ప్రజలలో జాతీయ భావం అభివృద్ధి చెందగల"దని చెప్పిరి.

హిందీ భాషా పరీక్షలకు హాజరయ్యే విద్యార్థులకు శిక్షణ యివ్వడమేగాక భారత హిందీ మహా విద్యాలయంచేపట్టిన సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమముల ద్వారా హిందీ భాషా, సాహిత్య కృషికి దోహదం చేస్తున్న విద్యాలయ నిర్వాహకులను శ్రీ రెడ్డి అభినందించిరి. విద్యాలయం విశ్వ విద్యాలయ స్థాయికి రాగలదని ఆశీర్వదించిరి.

ఈ సభలో శ్రీయుతులు యస్. సత్యనారాయణ (భవన నిర్మాణ సంఘాధ్యక్షులు) శ్రీ జి. వి సన్నయ్యశెట్టి (విద్యాలయ ఉపాధ్యక్షులు) డా॥ చలసాని సుబ్బారావు (విద్యాలయ ఉపాధ్యక్షులు) శ్రీ డి. మధుసూదన శాస్త్రి (హిందూ కళాశాల పాలకవర్గ కార్యదర్శి) ప్రభృతులు పాల్గొనిరి. అనేక మంది పుర ప్రముఖులు, రాజకీయ నాయకులు, వణిక్ప్రముఖులు, పాత్రికేయులు, విద్యార్థులు హాజరై సభను జయప్రదం జేసిరి.

శ్రీ ఎం. వి. సీతాపతిరావు గారి వందన సమర్పణతో సభ ముగిసినది.

---

## పరీక్షా ప్రమాణ పత్ర వితరణోత్సవం పామిడి

స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాల ఆవరణయందు 1982 ఆగస్టులో జరిగిన హిందీపరీక్షా ప్రమాణ పత్ర వితరణోత్సవము జరుపబడినది.

చి॥ శివలత, చి॥ లక్ష్మీదేవిల ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను. తరువాత హిందీ ప్రచారకులు శ్రీ ఏ. బి. ఉమాశంకర్. అతిథులకు, స్వాగతము పల్కుచూ కేంద్రములో జరుపబడు పరీక్షలను, తరగతులను, హిందీ ప్రచార కార్యక్రమాన్ని గూర్చి వివరించిరి.

సభకు శ్రీ జె. యన్ సత్యచంద్రరావు, (అసిస్టెంట్ స్టేషన్ మాస్టర్, కల్లూరు) గారు అధ్యక్షత వహించి ప్రమాణ పత్రములను బహూకరించిరి.

ముఖ్య అతిథులైన శ్రీ టి. ఫకురుద్దీన్, హిందీ ప్రచారకులు, (ఖాదర్‌పేట) గారు తమ వుపన్యాసంలో విద్యార్థులకు హిందీ ప్రచారకుల ద్వారా ద. భా. హిందీ ప్రచార సభ వారి సేవలను వివరించిరి.

హిందీ ప్రచారకులు ఎ. బి. ఉమాశంకర్ వందన సమర్పణము తర్వాత జాతీయ గీతముతో సభ ముగిసెను.

## హిందీ మహావిద్యాలయం
## విజయవాడ

విజయవాడ హిందీ మహా విద్యాలయ సత్రాంతోత్సవము 5-8-1983వ, తేదీన దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర శాఖ స్పెషలాఫీసరు శ్రీ వేమూరి రాధా క్రిష్ణమూర్తి గారి అధ్యక్షతన ఘనంగా జరిగింది. ప్రధానాచార్యులు కాజ వేంకటేశ్వర రావుగారు

బిదాల్యయ నివేదిక సమర్పించిరి.

విజయవాడ కార్పొరేటర్ శ్రీమతి యస్ మల్లి కాంబగారు భాషా విషయంలో, దక్షిణ భారత హిందీ ప్రచార వారి కృషిని ప్రశంసించిరి గాంధీ పర్వతం హిందీ మహా విద్యాలయం ప్రధానాచార్యులు శ్రీ చర్ల జనార్దన స్వామిగారు, కుమారి ఎస్. టి. వసంతగారు, బ్రాంచిమేనేజరు పి. ప్రసాద రావు గార్లు కూడ విద్యార్థినీ విద్యార్థులను ఆశీర్వదించుచూ ఉపన్యసించిరి.

సభాధ్యక్షులు శ్రీ రాధా క్రిష్ణమూర్తి గారు, హిందీ భాషాభ్యాసము యొక్క ఆవశ్యకత, భావి పౌరులు కానున్న విద్యార్థుల జీవిత విధానము వివరించి ఆశీర్వదించిరి.

చివరగా ఉపాధ్యాయినులు శ్రీమతి పి. ప్రభావతి, చి॥ కామాక్షిగారలు నిర్వహించిన వ్యాస రచన, ఉపన్యాస పోటీలందు గెలుపొందిన విద్యార్థులకు శ్రీమతి మల్లికాంబగారు, జనార్దన స్వామిగారలు బహుమతులొసంగిరి, "జనగణమన" గీతాలాపనతో సభ జయప్రదంగా ముగిసింది.

—o—

## ప్రమాణ పత్ర వితరణోత్సవము నెల్లూరు

గంగాధార నెల్లూరు పరీక్షా కేంద్రములో స్వాతంత్ర్య దినోత్సవ సందర్భముగా సెప్టెంబరు 82లో హిందీ పరీక్షలలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రముల నొసంగిరి.

ప్రార్థనా నంతరము స్థానిక జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ ధండపాణిగారు పతాకావిష్కరణ గావించిరి. వారు తమ ఉపన్యాసములో నేటి దేశ పరిస్థితులలో విద్యార్థుల కర్తవ్యాన్ని గుర్తెరిగించిరి. అటు తర్వాత హిందీ ప్రచారకులు శ్రీ జి. దేవరాజులు రెడ్డిగారు తమ ఉపన్యాసములో జాతీయ భాష యొక్క ప్రాముఖ్యతను తెల్పి దక్షిణ భారత హిందీ ప్రచార సభ ద్వారా సులభ పద్ధతులలో హిందీలో పట్ట భద్రులగు విధమును వివరించిరి. అటు తర్వాత శ్రీ ధండపాణిగారు హిందీలో ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రముల నొసంగిరి.

## హిందీ ప్రచారకులకు సత్కారం

స్థానిక హిందీ ప్రచారకులు శ్రీ జి. దేవరాజులు రెడ్డిగారు ఉద్యోగ రీత్యా తానెచ్చటనున్నా 1974వ సం॥ నుండి విద్యార్థులను ప్రోగుచేసి ఒకనాడు తాను చదువు కొన్న పాఠశాలలో నేడు హిందీ ప్రచారాన్ని ఉచితంగా చేస్తున్నారని వారి సేవను గుర్తించి ప్రధానోపాధ్యాయులు శ్రీ దండపాణి గారు హిందీ ప్రచారకులు శ్రీ జి. దేవరాజులు రెడ్డిగారిని తగు రీతిన సత్కరించారు.

## హిందీ విజయ పత్ర-వితరణోత్సవము
## పటన్ చెర్వు-మెదకు మండలము

తేది 24.3.83 మధ్యాహ్నము 3 గంటలకు జి. పి. బా. ఉ. పాఠశాల యొక్క ప్రధానోపాధ్యాయురాలైన శ్రీ జి. సీతా మహాలక్ష్మిగారి అధ్యక్షతన పాఠశాల భవనమందు ఈ ప్రమాణ పత్ర వితరణోత్సవము జరుపబడినది.

ప్రార్థనాగీతముతో సమావేశము ప్రారంభమైనది. ప్రథమశ్రేణి ఆంధ్ర భాషోపాధ్యాయులు శ్రీ టి. నాగభూషణంగారు స్వాగతోపన్యాసము నిచ్చిరి. ప్రమాణిత ప్రచారకులగు శ్రీ ఎన్. వెంకటేశం గుప్తగారు కేంద్రము యొక్క కార్యక్రమముల గురించియు ద. భా. హిం. ప్ర. సభ (ఆంధ్ర) ద్వార ఇచ్చట నిర్వహింపబడుచున్న ఉచిత హిందీ తరగతుల గురించియు వివరించిరి. అధ్యాపకులు శ్రీ జి. ప్రకాశరావు

గారు విద్యార్థినులు హిందీ, తెలుగు భాషలను నేర్చుకొనవలసిన ఆవశ్యకతను గురించి నొక్కి వక్కాణించిరి. ద్వితీయ శ్రేణి ఆంధ్ర భాషోపాధ్యాయులగు శ్రీ ఎన్. వెంకటకిష్టయ్య గారు హిందీ, తెలుగు మొదలగు పాఠ్యాధ్యయనముతో పాటు విద్యార్థినులు సాంస్కృతిక కార్యక్రమములలో కూడ పాల్గొనవలెనని సూచించిరి.

పటన్ చెర్వు కేంద్రము నుండి ఆగస్టులో ఉత్తీర్ణులైన పరీక్షార్థినులకు అధ్యక్షులు శ్రీమతి జి. సీతామహాలక్ష్మి గారి కరకమలముల ద్వార విజయ పత్రములు బహూకరింపబడినవి. అధ్యక్షులు తమ ఉపన్యాసమున హిందీ యొక్క ప్రాముఖ్యాన్ని ద. భా. హిం ప్రచార సభ యొక్క కృషిని వివరించిరి.

ధన్యవాదార్పణానంతరము బడి బాలికలగు ఐ. టి. నీరజ వి. సురేఖగారల జాతీయ గీతాలాపనతో నాటి సమావేశము ముగిసినది.

## కబీర్ జయంతి ఉత్సవము

### రామచంద్రాపురం

26-8-88 తేదీన ప్రసిద్ధ హిందీ కవి కబీర్ యొక్క జయంతిపాఠశాల B. H. E. L. హయ్యర్ సెకండరీ పాఠశాల యందు జరుపబడినది. శ్రీ ఎన్. పి. మిశ్రాగారు (Senior Manager-Designs B. H. E. L.) ముఖ్య అతిథిగ విచ్చేసిరి. శ్రీమతి ప్రభా ప్రతాప్ సింగ్‌గారి దర్శకత్వంలో పాఠశాల యొక్క బాల బాలికలు కబీర్ యొక్క జీవితము నందలి ముఖ్య ఘట్టములను చక్కగ ప్రదర్శించి ప్రేక్షకుల మన్ననలను పొందిరి. ఈ సందర్భమున దక్షిణ భారత హిందీ ప్రచార సభ-మద్రాసు పరీక్షల యందు ఉత్తీర్ణులైన విద్యార్థులకు ముఖ్య అతిథి ప్రమాణ పత్రములను వితరణ చేసిరి ముఖ్య అతిథి గారు కబీరు యొక్క ఔన్నత్యమును గురించి ప్రసంగించిరి. ప్రధానాచార్యిణి గారైన మాలతీ గోపాల కృష్ణ గారు బాల బాలికలకు తమ అమూల్య సందేశముల నిచ్చిరి. పాఠశాల యొక్క హిందీ పండితులు గారైన శ్రీ ఎమ్. రఘుపతి గారు ధన్యవాదములు సమర్పించిరి.

## ప్రభుత్వ జూనియరు కళాశాల

### పొందూరు

తే. 15-8-88న ఉదయం గం. 8 30 ని. లకు ప్రభుత్వ జూనియర్ కళాశాల పొందూరులో స్వాతంత్ర్య దినోత్సవము కడు వైభవముగా జరుపబడినది. శ్రీ జి. మధ సూదనరావుగారు జాతీయ పతాకమును ఎగురవేసినారు. శ్రీ సి. సన్యాసిరావుగారు బాలబాలికలకు స్వాతంత్ర్యదిన సందేశ మొసంగినారు. పిదప హిందీ ప్రమాణపత్ర వితరణోత్సవము ఘనముగా జరుపబడినది. పొందూరు కేంద్రములో వివిధ హిందీ పరీక్షలలో కృతార్థులైన బాలబాలికలకు శ్రీ జి. మధుసూదనరావుగారు హిందీ ప్రమాణ పత్రముల నొసంగినారు. హిందీ ప్రచారకులు శ్రీ అధికార్ల రామమూర్తి తన ప్రచార కార్యక్రమమును వివరించినారు. శ్రీ బి. జగన్నాధంగారు ధన్యవాద సమర్పణ గావించిరి.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము

### పచ్చల తాడిపత్రు

ది. 13 9. 88న సాయంత్రము 4.30లకు జిల్లా పరిషత్ హైస్కూల్ పచ్చల తాడిపత్రు నందు ప్రధానోపాధ్యాయులు శ్రీ భట్టిప్రోలు సోమశేఖర్‌రావుగారి కరకమలములతో 1988 ఫిబ్రవరి పరీక్షలలో ఉత్తీర్ణులైన ప్రాథమిక, మధ్యమ, రాష్ట్ర భాష విద్యార్థులకు ప్రమాణపత్ర వితరణోత్సవము జరుపబడినది

స్థానిక సీనియర్ హిందీ పండితులు శ్రీ కె. సీతా రామయ్య హిందీ ప్రాముఖ్యమును గురించి చెప్పిరి. వారు తమ తల్లిగారి జ్ఞాపకార్థము రెండువందల రూపాయలు విలువగల అల్యూమినియం మంచినీటి పాత్రను పచ్చలతాడిపర్రు, జిల్లాపరిషత్తు స్కూలుకు బహూకరించారు.

హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ సోమశేఖర రావుగారు మంచినీటి పాత్రను స్కూలుకు బహూకరించినందుకు శ్రీ సీతారామయ్యగారికి కృతజ్ఞతలు పాఠశాల తరపున తెలిపిరి. వారు తమ ఉపన్యాసములో విద్యార్థులు క్రమశిక్షణ నేర్చుకొనవలసినదిగా హితవు పలికిరి. జాతీయ గీతాలాపనతో ఉత్సవము ముగిసినది.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము

## నెహ్రూ హిందీ విద్యాలయం, కాకినాడ 4.

తా. 15 8. 83 సోమవారం సాయంత్రం 5గం. లకు నెహ్రూ హిందీ విద్యాలయం, ప్రతాపనగర్, కాకినాడ యందు 1982 ఆగష్టు, 1983 ఫిబ్రవరిలో ఉత్తీర్ణులైన వారికి ప్రమాణ పత్రములు ఇవ్వబడినవి.

నాటి సభయందు శాపగంటి సుబ్రహ్మణ్యం ప్రిన్సిపాల్ నెహ్రూ హిందీ విద్యాలయం గారు, ఇ.వి.ఆర్. రామారావు, హెడ్ మాష్టారు మునిసిపల్ హైస్కూలు గాంధీనగర్, వెత్సా సత్యానందహర ప్రసాద్ (ప్రెసిడెంటు బాయస్ క్లబ్) బుచ్చు వాసుదేవ మూర్తి (జె.సి. సెక్రటరీ) కె. సుమతీ దేవి, బి. సత్యనారాయణ, పి. జోసఫ్ దేవదాసు గార్లను వేదిక మీదకు ఆహ్వానించిరి.

ప్రార్థనా గీతముతో సభ ప్రారంభమైనది. విద్యార్థులకు, వచ్చిన అతిథులకు ప్రిన్సిపాల్ సుబ్రహ్మణ్యం గారు తేనీటి విందు నిచ్చిరి. అధ్యక్షులు రామమోహన రావుగారు, బుచ్చు వాసుదేవమూర్తి గారు, వెత్సా సత్యానంద హరిప్రసాద్ గారు, కె. సుమతీ దేవిగారు, బి. సత్యనారాయణగారు, పి. జోసఫ్ దేవదాసుగారు హిందీ యొక్క ప్రాముఖ్యతను గూర్చియు, ప్రిన్సిపాల్ సుబ్రహ్మణ్యం గారి యొక్క హిందీ సేవను గూర్చియు ప్రశంసించిరి. ప్రిన్సిపాల్ సుబ్రహ్మణ్యం. గారు పాఠశాల నివేదికను చదివినిపించిరి.

1982 ఆగస్టులోను, 1983 ఫిబ్రవరి ప్రవేశికలోను పాసు అయిన విద్యార్థులకు ప్రిన్సిపాల్‌గారు బుచ్చు వాసుదేవ మూర్తి (సెక్రటరీ జేసీ క్లబ్) గారిచే ప్రమాణ పత్రములను ఇప్పించిరి.

19821, 1983 పరీక్షలలో ప్రథమ శ్రేణిలోను, రెండవ శ్రేణిలో మొదట వచ్చిన వారికిని, ప్రాథమిక నుండి ప్రవీణ వరకు పూర్తిగా ఉత్తీర్ణులైన వారందరికి కె. సుబ్రహ్మణ్యంగారు, వెత్సా సత్యానంద హర ప్రసాద్ (ప్రెసిడెంటు బాయస్ క్లబ్) గారిచే బహుమతులు ఇప్పించిరి.

"జనగణ మనతో" సభ ముగిసినది.

## రాజభాష హిందీ దినోత్సవము

### విజయవాడ

ఈనెల 14వ తేదీన ప్రచారక విద్యాలయం, మాచవరంలో హిందీ దినోత్సవం శ్రీ పోలవరపు సుబ్బారావుగారి అధ్యక్షతను జరిగింది. "ఈనాడు అటం బాంబుల మారణహోమం కంటె భయంకరమైన పరిస్థితులు మన దేశంలో వున్నాయి వరకట్నం పేరుతో జరుగుతున్న నరరూప రాక్షసకృత్యాలు, బాల బాలికలను ఎత్తుకు పోయి వారిపట్ల చేయుచున్న క్రూరాతి క్రూర చర్యలు తలచుకుంటే మనం ఎక్కడకు, ఎటు పోతున్నాం అను ఆలోచన ప్రతి ఒక్కరికి కల్గుతుంది.

ఉపాధ్యాయులు ఈ సమస్యను పరిష్కరించగలరను ఆశ నాకు కల్గుతోంది. దేశ సమైక్యతకు హిందీ ప్రచారం అవసరం" అని అధ్యక్షులు చెప్పారు. అనంతరం ముఖ్య అతిథి శ్రీమతి సీతాకామరాజుగారు హిందీలో ఉపన్యసిస్తూ, హిందీలో డిగ్రీ పొందుటతో సంతృప్తి పడరాదు; అవసరాన్ని బట్టి అవకాశం వచ్చినపుడెల్లా హిందీలో మాట్లాడాలి; మధ్య మధ్య హిందీ ప్రాంతాలకు వెళ్ళి వాళ్ళతో సంభాషిస్తూ హిందీ భాషాభివృద్ధిని చేసికోండి' అని చెప్పారు.

శ్రీ మల్లాది శివరాంగారు హిందీలో స్వీయకవితను గానం చేసి తద్వారా హిందీ ప్రాముఖ్యతను తెల్పుతూ హిందీ ప్రచారమును మరింత ప్రచారం చేయవలసినదిగా ఉద్బోధించారు.

అనంతరం శిరపు అప్పారావు గారు మాట్లాడుతూ, 'హిందీ భారతీయ సమైక్యతకు చిహ్నమనీ, అందులకు యీనాడు సర్వమతముల మైత్రికై హిందీ భాషా ప్రచారము ప్రముఖ సాధనమని చెప్పుతూ యిటీవల తాము నిర్మల దేశపాండే గారితో కలిసి పంజాబు గ్రామాల్లో జరిపిన పాదయాత్రానుభవాలను వివరించారు.

సభా ప్రారంభమున కుమారి ఆలూరి పార్వతి స్వాగతం చెప్పింది. ప్రిన్సిపాల్ సుబ్బారావుగారు అధ్యక్షులను, ముఖ్య అతిథిని, వక్తలను పరిచయం చేస్తూ హిందీ దినోత్సవ ప్రాముఖ్యమును గురించి చెప్పారు ఉప్పలపాటి నాగార్జునరాజు వందన సమర్పణం చేసాడు. విద్యార్థి నాయకులు దుర్గా మల్లేశ్వర రావు కుమారి రాణి మంజుల అతిథులను సత్కరించారు. సభానంతరం యిస్కసువారి సాయంతో సోవియటు క్రీడలు, జీవితమును తెల్పు ఫిల్ము ప్రదర్శించబడింది.

## డాక్టర్ డి.సావిత్రి గారికి సన్మానము

ఒంగోలు

రాజస్థానపు భక్తా మీరాబాయి, ఆంధ్రదేశపు ప్రసిద్ధ భక్తకవయిత్రి తరిగొండ వెంగమాంబల భక్తి తత్వము మరియు గేయ కృతులపై, తులనాత్మకమగు శోధ ప్రబంధము సమర్పించిన శ్రీమతి దొడ్డవరం సావిత్రిగారికి ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు "డాక్టర్" ఉపాధిని గడచిన మార్చి నెలలో ప్రసాదించినారు.

ఈ సందర్భమును పురస్కరించుకొని, ఒంగోలు పి. వి. ఆర్. మునిసిపల్ సెకండరీ స్కూలులోని సాహిత్య సదన్ శాఖవారు ఆమెను స్వాతంత్ర దినము ఆగష్టు 15వ తేదీ నాడు పూలమాలలతోను, శాలువతోను సత్కరించి సన్మానించినారు. ఈ సత్కార ప్రదానము హెడ్ మాస్టరుగారైన శ్రీ కోప్పోలు హనుమంతరావుగారి ద్వారా జరిగినది. ఈ శాఖ వ్యవస్థాపకులు శ్రీ సింగరాజు రామచంద్రరావు గారు నిర్వహించినారు ఈ అభినందన సభా సందర్భముననే ప్రాథమిక నుండి విశారద వరకు, ప్రథములుగాను, ద్వితీయులుగాని వచ్చిన విద్యార్థులకు బహుమతి ప్రదానము కూడా జరిగినది.

# బి. ఏ. పరీక్ష

## దక్షిణ భారత హిందీ ప్రచారసభ మద్రాసు

ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థాన్ పక్షాన మద్రాసులోనూ, హైదరాబాదులోనూ ఎమ్. ఏ., ఎమ్. ఫిల్ పి హెచ్. డి పరీక్షలు జరుగుతున్నవి. ఈ సంవత్సరం హిందీ మాధ్యమంతో బి. ఏ. పరీక్షను గూడా నడపడానికి సంస్థాన్ నిర్ణయించింది. ఈ బి. ఏ. పరీక్ష పాఠ్యక్రమంలో ముఖ్యభాషగా హిందీ, ద్వితీయ, తృతీయ భాషలుగా ప్రాంతీయభాష, ఇంగ్లీషులు, ఇవిగాక వైకల్పిక విషయాలు రెండు ఉండగలవు. వైకల్పిక విషయాలలో ప్రయోజనాత్మక హిందీ, అనువాద విజ్ఞానం, సంస్కృతం, భారతదేశ చరిత్రవంటి ఎనిమిది విషయాలు ఉండగలవు

ఈ బి ఏ. పరీక్షలకు క్రింది యోగ్యతలు ఉన్నవారు హాజరుకావచ్చును.

(1) ఇంటర్మీడియెట్. పి. యు. సి, +2లో హిందీలో ఉత్తీర్ణులైనవారు,

(2) ఇంటర్మీడియెట్, పి యు సి., +2లో ఉత్తీర్ణులై ద. భా. హిందీ ప్రచారసభవారి రాష్ట్రభాషా విశారదలో ఉత్తీర్ణులైనవారు,

(3) దక్షిణ భారత హిందీ ప్రచారసభవారి రాష్ట్రభాషావిశారదలోనూ, యస్. యస్. సి. లోనూ ఉత్తీర్ణులై నియమానుసారం ఉచ్చశిక్షా ఔర్ శోధ్ సంస్థానంలో తమపేరు రిజిష్టరు చేయించుకొని, సంస్థానం తరపున నడిపించబడే ఇంటర్మీడియెట్ ఇంగ్లీషు ప్రశ్నపత్రాలు రెండింటిలోనూ ఉత్తీర్ణులైనవారు

సంస్థానం ఇంటర్మీడియెట్ ఇంగ్లీషు ప్రశ్నపత్రాల పరీక్షను రాబోవు ఏప్రిల్ మొదటి వారంలో నడిపించ గలదు. ఈ పరీక్షకు హాజరుకాదలచినవారు 31, అక్టోబరు 88లోపల రిజిస్ట్రేషను రుసుము రు 25/-లు పంపించి తమపేరు రిజిష్టరు చేయించుకొనవలెను. రిజిస్ట్రేషను పూర్తిఅయిన తరువాత పరీక్ష దరఖాస్తులు పంపవచ్చును.

పరీక్ష రుసుము 40/00
దరఖాస్తు ఫారం 2/-

దరఖాస్తు ఫారాలకు, తదితర వివరాలకు

రిజిష్ట్రారు,
హిందీ స్నాతకోత్తర కాంప్లెక్స్
పి బి. నం. 82. ద. భా హిందీ ప్రచారసభ,
ఖైరతాబాదు, హైదరాబాదు 500 004. కు వ్రాయవలెను.

హిందీ ప్రచారకులు, హిందీ భాషాభిమానులు, విద్యార్థులు, ఈ సదవకాశాన్ని వినియోగించుకొనగలరని విశ్వసిస్తున్నాము.

వే. ఆంజనేయ శర్మ
రిజిష్ట్రారు,

# దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, హైదరాబాదు

ది 28 ఆగస్టు 1983 నాడు హైదరాబాదులో జరిగిన దక్షిణ భారత హిందీ ప్రచార సభ, ఆంధ్ర, కార్యనిర్వాహక వర్గ సమావేశంలో

శ్రీ ఎం. వి. పాపన్నగుప్త,
మదనపల్లి
ఆంధ్రశాఖకు అధ్యక్షులుగాను

శ్రీ కట్టా పూర్ణానందరావు
ఏలూరు
ఉపాధ్యక్షులుగాను

శ్రీ అల్వా సూర్యనారాయణ
ఏలూరు
కార్యనిర్వాహక వర్గ సభ్యులుగాను

ఎన్నుకొనబడినారని తెలుపుటకు సంతోషిస్తున్నాము.

హైదరాబాదు
ది. 1-9-1983

వేమూరి రాధాకృష్ణ మూర్తి
విశేషాధికారి

Edited, Printed and Published by V. Radhakrishna Murty, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press, Hyderabad-500 004.